# చిన్నారి విజయం

పిల్లల నవల



గీతా సుబ్బారావు





ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
హైదరాబాద్.

CHINNARI VIJAYAM - Children Novel
By : GEETHA SUBBA RAO
published by: Director & special officer, A.P. Baalala Akademi,
c/o. Jawahar Bal Bhavan, Public Gardens, Hyderabad - 500 004

ప్రచురణ సంఖ్య : 82
మొదటి ముద్రణ : 1993
ప్రతులు : 5000

వెల : రు. 8-00

ముఖచిత్రం :
చిత్రాలు: గోపి

టైప్ సెట్టింగ్ :
ప్రసాద్ గ్రాఫిక్స్
హైదరాబాద్

ముద్రణ :
కళాజ్యోతి ప్రోసెస్ ప్రైవేట్ లిమిటెడ్
ఆర్.టి.సి. క్రాస్‌రోడ్స్, హైదరాబాద్.

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
జవహర్ బాలభవన్
పబ్లిక్ గార్డెన్స్, హైదరాబాద్-500004.

# తొలిపలుకు

బాలలకు విద్యావైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976 లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమిని స్థాపించింది. నాటి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి, నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. బాలల అకాడమి తన లక్ష్యసాధన కోసం చేపట్టిన పథకాలలో బాలసాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

జవహర్ బాలభవన్ బాలల్లోని సృజనాత్మక కళలను ప్రోత్సహిస్తుంటే, బాలభవన్‌లో మరొక భాగమైన బాలల అకాడమి బాలల విజ్ఞానోదయానికి కృషి చేస్తున్నది. బాలల సమగ్ర అభ్యుదయానికి ఇవి రెండూ రెండుకళ్ళు వంటివి. విజ్ఞానానికీ, వినోదానికీ రెండూ ఒకే వేదికగా విరాజిల్లుతున్నాయి.

వివిధ వయోవర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు, సరళమైన భాషలో, తేలిక పదాలతో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవితచరిత్రలు, నవలలు, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాబల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాల సాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ఇకపై కూడా బాలలకు ఆసక్తిని కలిగించే పుస్తకాలను ప్రచురించే ప్రయత్నాలు చేస్తున్నాము. ఉత్తమ అభిరుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు - మేము చేస్తున్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి తీసుకురావటానికి సర్వవిధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.


శారదా అశోకవర్ధన్

సంచాలకులు మరియు ప్రత్యేకాధికారిణి

జవహర్ బాలభవన్, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

ఈశ్వర అల్లా తేరేనామ్
సబకో సన్మతిదేభగవాన్

"నూటపాతికేళ్ళు బ్రతకాలని నాకు లేదు.
ఇంగ్లీషువారిని ఎదుర్కొన్నప్పుడు కూడా
నే నింత నిరాశ పడలేదు!
కాని ఇవాళ సోదరుడు సోదరుణ్ని చంప
డానికి ప్రయత్నిస్తున్నాడు.
ఇవ్వన్నీ చూస్తూ నే బ్రతక లేను.
అంచేత, మీరందరూ 'ఓ భగవంతుడా!
భారతదేశానికి సద్బుద్ధినయినా ఇవ్వు.
లేకుంటే-ఈ దావానలంనుంచి ఈ ముస
లాణ్ని తప్పించు' అని ఆ రాముణ్ని
ప్రార్థించండి!
భారతదేశం పరిశుద్ధమైనా కావాలి -
లేకుంటే, నేనయినా లేకుండా పోవాలి!"

*1947 అక్టోబరు 2న హిందూ ముస్లిం కలహాలను
చూసి పూజ్య బాపూజీ అన్న మాటలివి.*



# వేణు కథనం

మాది చిన్నపల్లెటూరు. నాన్న పేరు భీముడు అంటారు. మా ఇంట్లో మా అమ్మా, నేనూ, మా చెల్లి ఉంటున్నాం. మా చెల్లి చాలా చిన్నది. పుట్టి రెండేళ్ళే అయింది.

మానాన్న బస్తీలో ఉంటున్నాడు. అక్కడ ఉద్యోగం చేస్తూ ప్రతీనెలా మాకు డబ్బు పంపిస్తూ ఉంటాడు. ఆ డబ్బుతో మేము జీవిస్తున్నాం.

మా ఊళ్లో ఓ వీధిబడి ఉంది. ఆ వీధిబడిలో నేను అయిదో తరగతి వరకు చదువుకున్నాను. తర్వాత, ఇంట్లోనే చదువు కున్నాను.

మా ఇల్లు చిన్నదే అయినా ఇంటిచుట్టూ చక్కనిపూల మొక్కలు, కావలసినన్ని కూరగాయల పాదులూ ఉన్నాయి.

ఆ మొక్కలన్నీ నేనూ, అమ్మా కలసి కష్టపడి వేశాం. రోజూ నీళ్లుపోసి గొప్పులు తవ్వి బోలెడు కూరగాయలు పండిస్తాం మేము.

అవన్నీ మా రామయ్య తాత బస్తీ తీసుకుపోయి అమ్ముకు వస్తాడు.

రామయ్య తాత చాలా మంచివాడు. ఇప్పుడు ఎంత మంచివాడో ఇదివరకు అంత చెడ్డవాడట !...రామయ్య తాతకి ఇప్పుడేం డబ్బు లేదుకాని ఇదివరకు చాలా డబ్బు ఉండేదట.

ఆ డబ్బు ఉన్నన్నాళ్లూ తాగీ, జూదం ఆడీ డబ్బు అంతా పాడు చేసుకున్నాడుట ! ఆ డబ్బు అంతా పోయాక ఇలా బుద్ధిమంతుడయి పోయాడుట !

ఇప్పుడు రామయ్య తాతకు పూరిపాక తప్పిస్తే మరేంలేదు.

ఎప్పుడేనా తీరికగా ఉంటే, రామయ్య తాతే ఇవన్నీ చెబుతాడు. రామయ్య తాత నోరు మూసుకొని మాట్లాడకుండా ఎప్పుడూ ఉండేవాడు కాదు. బలేబలే కబుర్లు చెప్పేవాడు. కబుర్లు ఏమిటి....చాలా కథలు కూడా వచ్చు.

ముఖ్యంగా రామయ్య తాతకు అమ్మ మీద, నామీద చాలా ప్రేమ.

రామయ్యతాత రోజూ పొద్దుటే మా ఇంటికీ, వాళ్ళింటికీ వీళ్లింటికీ వెళ్ళి.... కూరగాయలూ, పూలు అన్నీ ఓ గంపలో పోసుకుని, అవన్నీ తీసుకుపోయి బస్తీలో అమ్ముకుని వచ్చేవాడు. అమ్ముకుని వచ్చినందుకు తను కొంత లాభం తీసుకొని మిగిలిన డబ్బులు ఎవరివి వాళ్ళకు ఇచ్చేసేవాడు.

మేము నాన్న పంపిన డబ్బుల్తోనూ, కూరగాయలు అమ్మగా వచ్చిన డబ్బుల్తోనూ అలాగే గడుపుకుంటున్నాం.

ఇలా ఉండగా ఊళ్ళో పెద్ద గల్లంతు బయలుదేరింది.

హిందూ ముస్లింలు ఒకర్నొకరు కొట్టుకోవడం, చంపుకోవడం చేసుకుంటున్నారని తెలిసింది.

ఈ సంగతి బస్తీనుంచి రామయ్య తాతే మోసుకువచ్చాడు.

మా ఊళ్ళో కూడా ముస్లింలు చాలా మంది ఉన్నారు. కాని మేము ఎప్పుడూ తిట్టుకోనన్నాలేదు.

అసలు హిందువుల్ని చంపేది మామూలు ముస్లింలు కాదు. వాళ్ళని 'రజాకార్లు' అంటారుట. వాళ్ళు హిందువుల్ని ఎక్కడా బతకనివ్వడం లేదట.

వాళ్లు ఆడవాళ్ళే కానీయండి, మగవాళ్ళే కానీయండి, పసిపిల్లలే కానివ్వండి హిందువులయితేసరి...కత్తులతో పొడిచి, కర్రలతో బాది

చిత్రవధ చేసి చంపేయడం మొదలు పెట్టారట !.... పొద్దుటే కూరలగంప తీసుకొని బస్తీకి వెళ్ళిన రామయ్య తాత కోసం, ఊళ్ళో వాళ్ళంతా మధ్యాహ్నం నుంచీ కాసు క్కూర్చునే వాళ్ళు. రామయ్యతాత బస్తీ నుంచి సాయంకాలం రాగానే, అతనిచుట్టూ జనం మూగిపోయేవారు.

తాత గంప అక్కడ పడేసి, మర్రిచెట్టుకింద కూర్చొని రజాకార్ల కబుర్లు చెప్పడం మొదలుపెట్టేవాడు.

ఆ రజాకార్లు మగవాళ్ళనీ, వయసుమళ్ళిన వాళ్ళనీ వెంటనే కత్తులు పెట్టి పొడిచేవారట !.... ఇంకొందరు చెట్లకి తలకిందులా వేళ్ళాడదీసి, దిగువ మంటలు పెట్టేవారుట!.....

పసిపిల్లల్ని నేలకేసి కొట్టేసేవారుట!...లేకపోతే గోడమీద పెట్టి బల్లాలు దిగేసే వారుట!...

ఇక ఆడవాళ్ళని అయితే నానాహింసలూ పెట్టి... అంద విహీనులను చేసేవారుట !

ఈ సంగతులన్నీ రామయ్య తాతే చెప్పేవాడు. ముందు కొన్నిరోజులు ఇలాగే చెప్పాడు. కాని తర్వాత పేపరుకొని తీసుకురావడం ప్రారంభించేడు.

ఆ పేపర్లో అన్ని సంగతులూ ఉండేవి.

ఈ సంగతులన్నీ విన్న ఊళ్ళో వాళ్ళంతా కూడా హడలి పోయారు !

నాన్నని వెంటనే బయలుదేరి రమ్మని ఉత్తరం రాయన్నది అమ్మ. నాకు కూడా చాలా భయం వేసింది. వెంటనే ఉత్తరం రాసి పోస్టుచేశాను.

ఆ రజాకార్లు ఎప్పుడువచ్చి ఊరుమీద పడతారోనని అంతా గుప్పెట్లో ప్రాణాలు పెట్టుకుని బతుకుతున్నారు.

మా ఊరునుంచి కూడా కొందరు ముస్లింలు వెళ్ళి రజాకార్లలో చేరారు.

మా ఇంటి వెనక సందులోనే కాశీం అనే ముస్లింఉన్నాడు.

వాడుకూడా వెళ్ళి రజాకార్లలో చేరేడుట ! కాశీం అంటే నాకు పడదు. వాడు మంచివాడు కాదు. వాడికి ముంతాజ్ అనే ఓ కూతురు ఉంది. ముంతాజ్‌కి తొమ్మిదేళ్ళో, పదేళ్ళో ఉంటాయి.

నేను అయిదోక్లాసు చదివినప్పుడు తను రెండోక్లాసు చదువుతూ ఉండేది. ముంతాజ్‌కు తెలుగు మాట్లాడటం బాగానే వచ్చును. కాని, ఒక్క అక్షరం కూడా సరిగా రాయలేక పోయేది. రెండో తరగతిలోకి వెళ్ళిందేకాని, గుణింతాలుకూడా సరిగా రావు.

ఇదివరకు రోజూ మా ఇంటికి వచ్చి నాదగ్గర ప్రయివేటు నేర్చుకునేది. ఇప్పుడు వాళ్ళు ఇల్లు మార్చేసిన తర్వాత మా ఇంటికి రావడం మానేసింది.

పాపం...ముంతాజ్‌కు అమ్మలేదు. చిన్నప్పుడే చచ్చిపోయింది. ఇప్పుడున్నది సవతితల్లి. ఈ సంగతి ముంతాజ్‌కు తెలియదుకాని, నాకు తెలుసు !

అసలు అమ్మ అయితే అన్నం అవీ బాగా పెడుతుంది. కానీ సవతి తల్లి పెడుతుందా?

తిండికి బదులు కావలసినన్ని బాధలు పెడుతుంది.

మా అమ్మకి ముంతాజ్‌ని చూస్తే చాలా జాలి. ముంతాజ్ మా ఇంటికి ఎప్పుడు వచ్చినా సరే తినటానికి ఏదయినా పెట్టేది.

ఇప్పుడు ముంతాజ్ రావటమే మానేసింది. అసలు ఈ హిందువులు, ముస్లింలు ఎందుకు కొట్టుకుంటున్నారో నాకు అర్థంకాలేదు !

రామయ్య తాతని చాలాసార్లు అడిగితే-ఓసారి 'కలికాలం బాబూ !' అన్నాడు. మరోసారి 'తిని ఉండలేక అన్నాడు.' రామయ్య తాత చెప్పే కబుర్లను బట్టి చూస్తే గడియకో, గంటకో ఈ 'రజాకార్లు' మా ఊరి మీద కూడా పడతారనిపించింది. నాన్నకి ఉత్తరం రాసినా ఇంకా రాలేదు.

ఊళ్లోవాళ్ళు భయపడినట్టుగానే ఒకనాటి అర్ధరాత్రి రజాకార్లు

గ్రామంలో ప్రవేశించారు.

మాది పల్లెటూరు అని చెప్పానుకదూ. చిమ్మ చీకటి. ఊళ్ళో అంతా చెప్పలేనంత భయంకరమైన గోల. ఆ గోల వింటూంటే గుండెలదిరిపోయాయి!.... ఒళ్ళంతా చలివేసి నట్టు వణికి పోయింది.

ఇంతలో మా తలుపు భడాలున తోసుకొని రజాకార్లు మా ఇంట్లో ప్రవేశించారు!....

ఎవడో కాని, చాలాపొడవుగా ఉన్నాడు. గుండు, మొలకు పెద్దతోలు బెల్టు, చేతిలో పెద్దబల్లెం అవీ ఉన్నాయి. వాణ్ణి చూసి నేను కెవ్వున కేకవేశాను. నోరు విడింది కాని శబ్దం మాత్రం రాలేదు. మాట్లాడదామన్నా మాట్లాడలేక పోయాను. అలాగే చాపసు కరుచుకు ఉండిపోయాను.

వాడు తిన్నగా అమ్మపడుకున్న మంచందగ్గరకి వెళ్ళాడు.

గభాలున అమ్మపక్కన పాలుతాగుతున్న చెల్లిచెయ్యి పుచ్చు కుని.....అమాంతంగా పైకెత్తేశాడు. పెద్ద గుక్క పెట్టి ఏడ్చింది చెల్లి !....ఆ మరుక్షణంలోనే అమ్మలేచి పెద్దకేకవేసింది.

ఇంక నేనేం చెప్పలేకుండా ఉన్నాను.

ఆ దృశ్యం తలుచుకున్నా, చెబుదామనుకున్నా నా తలదిమ్మెక్కి పోయి నాకు మైకం వచ్చేస్తోంది !....

వాడు ఆ పళంగా చెల్లిని కిందపడేసి....బల్లాన్ని గుండెల్లో దిగవేశాడు.

అంతకు ముందే నన్ను అమ్మ పారిపోమని సైగచేసి-ఆ దృశ్యం చూసి......నిలువునా కూలిపోయింది !.... కిందపడిపోతున్న అమ్మను......ఎత్తుకొని భుజాన వేసుకొని వెళ్ళిపోయాడు ఆ దుర్మార్గుడు ! వాడు వెళుతున్నప్పుడు వాణ్ణి నేను పోలిక పట్టేను.

వాడెవడో పైవాడుకాదు....ముంతాజ్ తండ్రి అయిన కాశిం.

'అమ్మా....అమ్మా !!' అని గోలపెట్టి ఏడ్చాను. ఇంకెక్కడి

అమ్మ?...అమ్మను ఆ దుర్మార్గుడు తీసుకుపోయాడు.

బయటకువచ్చాను. బయట ఆకాశమంతా ఎర్రగా ఉంది. ఆకాశమే కాదు. ఊరే ఎర్రగా ఉంది. దూరంగా ఇళ్ళన్నీ భగభగ కాలిపోతున్నాయి. వెదురు కర్రలు కాలి ఠపఠపా పేలుతున్నాయి. భోరున జనం గోలపెడుతున్నారు !......

ఇంతలో 'వేణూ వేణూ' అంటూ ఎవరో పిలిచారు.

ఎవరా అని చూస్తినికదా..... ముంతాజ్ ! -

ముంతాజ్ పరిగెత్తుకు వచ్చి, నన్ను గట్టిగా కౌగలించుకొని బోరున ఏడ్చింది.

ముంతాజ్ ఏడుపు చూసేసరికి - నా బాధ మరింత ఎక్కువయిపోయి, ఏడుపు తగ్గిపోయింది.

'ఏడవకు...ముంతాజ్-ఏడవకు !.....' అన్నాను.

'మా అమ్మలేదు వేణూ...మా అమ్మలేదు, నన్ను వది లేసి.....వాళ్ళమ్మ దగ్గరకు వెళ్ళిపోయింది' అంటూ ఏడ్చింది. ముంతాజ్.

పిచ్చి పిల్ల!....లేకపోతే, ఆ సవతి తల్లి వాళ్ళింటికి తీసుకువె ళుతుందా?.....

"నీకే కాదు....నాక్కూడా అమ్మా, చెల్లీ లేరు ముంతాజ్..... నాక్కూడా లేరు!!....." అన్నాను నేను.

అమ్మనూ, చెల్లినీ తలుచుకునే సరికి నాకు ఏడుపు ఆగలేదు.

ముంతాజ్‌ను కౌగలించుకుని వల వలా ఏడ్చాను!......

ఇంతలో గుర్రాలు పరుగెడుతున్న ధ్వని మా వైపే రాసాగింది.

'రా ముంతాజ్....మనం ఇక్కడ ఉంటే......మనల్ని కూడా ఆ దుర్మార్గులు చంపేస్తారు.....' అంటూ ముంతాజ్‌ను తీసుకుని......ఆ చీకట్లోకి పరుగెత్తాను.

# భీముడి కథనం

నన్నే భీముడు అంటారు. నేను వేణూ నాన్నని. నాకు ముందు నుంచీ భయంగానే ఉంది. ఈ రజాకార్ల హడావుడీ ప్రారంభం అయిన దగ్గర్నుంచీ మా ఊరు వెళ్ళాలనే ప్రయత్నిస్తున్నాను. కాని, సెలవు దొరికింది కాదు.

వేణు దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిన తర్వాత నేనిక ఆగలేక పోయాను. 'నాకు సెలవు ఇస్తారా, ఉద్యోగానికి రాజీనామా ఇవ్వమన్నారా' అని అడిగాను నేను.

'రాజీనామా ఇవ్వమని మేం అనం! సెలవు మాత్రం ఇవ్వం....' అన్నారు అధికారులు. సరే నా పెళ్ళాం పిల్లల కన్నా ఈ ఉద్యోగం ఎక్కువ కాదు?....వెంటనే రాజీనామా ఇచ్చి' రావలసిన జీతం తీసుకొని మా ఊరు బయలుదేరాను.

రైల్లో స్థలం దొరకలేదు. జనం కిటకిటలాడేరు. రైలు కమ్మీలే కాకుండా ఒకరిచేతులొకరూ, ఒకరి భుజాల నొకరూ పుచ్చుకొని వేళ్ళాడేరు. ప్రాణాలకు తెగించి రైలు పెట్టెల టాపుల మీద పిల్లలూ, ఆడవాళ్ళూ కూడా ఎక్కికూర్చున్నారు.

హిందువు ఎవరో, ముస్లిం ఎవరో చెప్పలేము. కొందరు ముస్లింలు కూడా బురఖాలు వేసుకున్నారు. కొందరు ముస్లింలు కూడా బొట్లుపెట్టుకున్నారు. ఎవరికెవరు బంధువో ఎవరికి అక్కరలేదు. అంతా ఎవరి ప్రాణాలు వాళ్ళు రక్షించుకుంటున్నారు.

ఎవరి సౌఖ్యం వాళ్ళు చూసుకుంటున్నారు. ఎవరి ముఖాల్లోనూ ఆనందం గోచరించదు. అందరి ముఖాలూ కళావిహీనమై విచారంగా ఉన్నాయి. ఈ జనాన్ని చూసేసరికి నా ఆందోళన మరింత ఎక్కువ అయింది.

ఇంటిదగ్గరవాళ్ళు ఎలాఉన్నారో.....ఏమో!.....చిట్టి తల్లి ఎలా ఉందో !....అది ఆర్నెల్ల పిల్లగా ఉన్నప్పుడు పొట్ట చేత్తోపుచ్చుకొని ఈ ఊరు వచ్చేశాను. మళ్ళీ చూడనేలేదు.

ఈ పాటికి బాగా పెద్దదై ఉంటుంది. వసపిట్టలా వాగుతోందని వేణు ప్రతి ఉత్తరంలోనూ రాసేవాడు.

ప్చ్, ఈ ఉత్తరంలో దాన్ని గురించే రాయలేదు. ఈ చివర్నుంచి ఆ చివరిదాకా 'వెంటనే బయలుదేరి రండి' అని మాత్రమే రాశాడు.

జానెడు పొట్టకోసం ఇంత దూరంలో ఉండవలసి వచ్చింది.

పోనీ, వాళ్ళనే బస్తీకి తీసుకువద్దామంటే-ఇక్కడ ఈ జీతం రాళ్లు సరిపోవుగదా! అక్కడ వాళ్లు తోట మీద సంపాదించుకునే డబ్బులు కూడా చేతికందవు.

సరే, అక్కడ వాళ్లూ, ఇక్కడ నేనూ ఎలాగో జీవిద్దాం అనుకుంటే దైవం చిన్నచూపు చూశాడు.

తినతిండీ, కట్టబట్టాలేని ఈ స్థితిలో హిందువు, ముస్లిం అన్న ఈ తగాదాలేమిటి?

ఏమిటో?

ఎంత సముదాయించుకుందామనుకున్నా మనస్సుకు ధైర్యం చిక్కలేదు. రైలుకంటేవేగంగా పరుగెత్తింది నా మనసు!....నించోలేక, కూర్చోలేక....... పిచ్చివాడినయ్యాను.

చివరకు స్టేషన్ వచ్చింది. దిగేను. స్టేషనుకు మా ఊరు రెండు మైళ్ళ దూరంలో ఉంది.

నా ఆందోళకు తగినట్లుగానే ఉంది.

నా ఆందోళకు తగినట్లుగానే బయట ఒక్క ఎద్దుబండీ కూడా

లేదు. నడవక తప్పింది కాదు.

నేను ఊళ్లోకి వెళ్లేసరికి సాయంత్రం అయింది. ఊళ్లో ఎక్కడా అలికిడిలేదు. నా గుండె బిక్కుబిక్కుమంటోంది.

బావురు మంటున్న ఊళ్ళో కొన్ని ఇళ్ళు సగం కాలి, మరి కొన్ని మసి అయి ఉన్నాయి.

ఎక్కడా మనుష్యులున్నట్లేలేదు. నా పై ప్రాణాలు పైనే పోయాయి. చిన్న పిల్లాడిలా ఏడుస్తూ...మా ఇంటికి పరిగెత్తాను. తలుపు బార్లగా తీసేఉంది. లోపలికెళ్లాను.

నిలువునా నీరయిపోయాను !.....

'కొంపతీశావురా......భగవంతుడా!' అని బిగ్గరగా ఏడ్చాను!.....

నేను ఎవర్నయితే చూడాలని అనుకున్నానో ఆ చిట్టితల్లినే దూరం చేశాడు దేవుడు!....

నా చిట్టి తల్లిని పొట్టన బెట్టుకున్న ఆ దుర్మార్గుడి రక్తం కళ్ళ చూడందే నా కసి తీరదు! వాడి ఒళ్ళంతా శూలంతో తూట్లుగా పొడవనిదే నా మనస్సుకు శాంతిలేదు.

ఇంతకూ వేణూ, వేణూ వాళ్ళమ్మా ఏమయినారో ! బయటకు వచ్చాను.

'వేణూ వేణూ' అని బిగ్గరగా పిలిచాను. ఆ పిలుపు కొండని ఢీకొని మళ్ళీ నాకే వినిపించింది.

అయ్యయ్యో.... వీళ్ళు ఏమయ్యారో........ఎక్కడ ఉన్నారో.... ఎలా వెతికేది?......

'వేణూ....... ' అంటూ కొండకేసి పరిగెత్తాను.

వేణు పరుగెత్తుకుంటూ నాకు ఎదురువచ్చాడు.

వేణుని అమాంతం ఎత్తుకుని హృదయానికి హత్తుకున్నాను.

'అమ్మేదిరా వేణూ... అమ్మేది?' అని అడిగాను.

'అమ్మ...' అంటూ వేణూ గొల్లున ఏడ్చాడు.

'లేదు నాన్నా...... అమ్మ లేదు!'

'ఏమయిందీ?.....'

"అమ్మని వాళ్ళు ఎత్తుకు పోయారు"

దుర్మార్గులు అనుకున్నంత పనీ చేశారన్న మాట!

'ఆ ఎత్తుకుపోయినవాడి మొహం నీకేమయినా గుర్తుందా బాబూ?.....'

'వాడు నీక్కూడా తెలుసు నాన్నా...' అన్నాడు వేణు.

'ఎవ్రరావాడు?...'

'వాడేనాన్నా... పక్కసందులో ఉండే కాశీం....' అని చెప్పాడు వేణు. వాడూ రజాకార్లలో కలిసేడా?

'ఇదంతా ఎప్పుడు జరిగిందిరా వేణు?' అని అడిగాను.

'నిన్న రాత్రి నాన్నా! - చాలా గొడవ జరిగింది.'

'ఏం జరిగిందిరా?'

'చెప్పలేను నాన్నా! - భయం వేస్తోంది! అమ్మని ఆ దుర్మార్గులు ఎత్తుకుపోయారు. నేనూ, ముంతాజ్ మాత్రం తప్పించుకుని ఆ కొండగుహలో దాగున్నాం-' అంటూ నన్ను కౌగలించుకున్నాడు వేణు.

"వాళ్ళుకాదురా దుర్మార్గులు! నేనే పరమ దుర్మార్గుణ్ణి! - చేతకానివాణ్ణి!"

చిన్నప్పుడు మా నాన్న చెప్పినట్లు విని చదువుకుంటే - ఈ స్థితికి వచ్చేవాణ్ణా? నాకు బస్తీలో మంచి ఉద్యోగం అయి ఉండేది ! హాయిగా-అందరం అక్కడే ఉండే వాళ్ళం! నేను ఇంట్లో ఉండగా కాశీం అడుగు పెట్టేవాడా! పెట్టినా - బతికే వాడా? ఏం లాభం? ఇప్పుడు ఏమనుకున్నా ఏం లాభం లేదు. చదువులేదు! తెలివిలేదు!.... శరీరం మాత్రం ఉంది!

డబ్బులేని ఈ శరీరానికి ఎవరు భయపడతారు?... నేనిలా చేతులు కాలాక విచారిస్తూంటే- వేణు, వేణు పక్కనున్న పిల్లా నన్ను బేలగా చూశారు.

'ఈ పిల్లెవరు బాబూ?'

'ముంతాజ్ నాన్నా! అప్పుడే మర్చిపోయావా?- ' అన్నాడు.

రెండేళ్ళలో ఎన్ని సంగతులు మర్చిపోయాను. నాకే ఆశ్చర్యం వేసింది.

'నాకేం గుర్తులేదు!' అన్నాను.

'మనింటికి వచ్చేది కదు నాన్నా... కాశీం కూతురు' అన్నాడు వేణు. గతుక్కుమన్నాను.

'ఆ రాక్షసుడి కూతురా?'

'దాన్నెందుకు తీసుకొచ్చావ్?....'

'పాపం ముంతాజ్ కెవరూ లేరు నాన్నా!' అన్నాడు.

'లేకపోతే నేనేం చేసేది?...'

'మనతోనే ఉంటుంది నాన్నా!'

'మనతోనా?......'

'ఔను నాన్నా!....'

'వీల్లేదురా-వీల్లేదు! అందులోకి ఆ దుర్మార్గుడి కూతురినా?......దీన్ని నా ఎదురుగుండా లేచి పొమ్మను!....'

'లేదు నాన్నా......ముంతాజ్ చాలా మంచిది నాన్నా'

'మంచిదయినా, చెడ్డదయినా మనతో వద్దురా! - నా మనసేం బాగులేదు!... దాన్ని వాళ్ళ నాన్న దగ్గరికి పొమ్మనమని చెప్పేయ్.' వేణు 'కాదు' అంటూ ఎన్నో మాటలు చెప్పేడు - దాని తల్లి చచ్చిపోయిందనుకున్నాడు. దానికి ఎవరూ లేరు అన్నాడు. చాలా మంచిది అన్నాడు. కానీ నామనస్సు మాత్రం ఒప్పలేదు.

'నా చిట్టితల్లిని, మీ అమ్మను పొట్టన పెట్టుకున్న ఆ దుర్మార్గుడి కూతుర్ని మనం పోషించడమా !....'

ఆ కాశీంను తలచుకుంటుంటే, నా ఒళ్ళుమండి పోయింది.

కాశీంకు ప్రతీకారం చేసి తీరాలని నిశ్చయించుకున్నాను.

నాకసి తీరా దాని పీక నులిమేద్దామనిపించింది!

'నా చిట్టితల్లిని ఆ పాపిష్టివాడు ఎలా చంపేడో వాడి కూతుర్ని అలాగే చంపి నా అక్కసు తీర్చుకుంటాను!'

'వద్దు నాన్నా... వద్దు!...' ముంతాజ్‌ని ఏమి అనకు నాన్నా!... ముంతాజ్‌ని చంపితే ఏమొస్తుంది నాన్నా? ....వాళ్ళ నాన్న దుర్మార్గుడైతే.... వాళ్ళ నాన్నని చంపుదాం నాన్నా!... ముంతాజ్‌ని వదిలేయ్!...' అంటూ నాకడ్డం పడ్డాడు వేణు.

ముంతాజ్ వాడిచేతులు గట్టిగా పుచ్చుకుని, వాడి వెనుక నించుంది. నా కోపం మరింత ఎక్కువయింది.

'వేణూ!.... లే....అడ్డు లేచిపో! దాని రక్తం కళ్ళ చూడందే నా కోపం చల్లారదు!'

'దాన్ని కాదునాన్నా ముందు నన్నుచంపు!' అన్నాడు వేణు.

'వేణూ... ఇంక నాకు అడ్డు చెప్పకు! - లే...' అంటూ, ఆ రెండుచేతులూ పుచ్చుకొని దూరంగా తోసేశాను.

ముంతాజ్ పీకెమీద రెండుచేతులూ వేశాను-

ఛీఛీ-భగవంతుడు ఆ రాక్షసుడికి ఇచ్చిన రాతిగుండెనయినా కనీసం నాకు ఇవ్వలేదు! ... ఇందులో కూడా పక్షపాతమే!

ఎంత బలం ఉంటే మాత్రం ఏం ప్రయోజనం? - నా బతుకింతేనా! హు- పసిపిల్ల కాబట్టి చంపలేకపోయాను! కానీ, ఆ దుర్మార్గుడు కనిపిస్తే వాణ్ని చిత్రవధ చేసి తీరుతాను.

కిందపడ్డ వేణుకి రాయితగిలి తలకి దెబ్బ తగిలింది.

'వేణు... వేణూ...' అంటూ ముంతాజ్ పరుగెత్తుకు వెళ్ళింది.

తన పరికిణీచింపి, గాయానికి కట్టు కట్టింది!

నేను వేణుదగ్గరికి వెళ్ళలేకపోయాను. పసిపిల్లమీద పగసాధిస్తే - ఆ రజాకార్ కాశింకూ నాకూ తేడా ఏమిటి?...

ఏమి తోచక అక్కడే కూర్చుండి పోయాను.

ఇంతలో వేణుయే నా దగ్గరికి వచ్చాడు.

'నాన్నా....'

వేణుని నా హృదయానికి హత్తుకున్నాను.

'నాన్నా... ఇప్పుడేం చేద్దాం నాన్నా?' అని అడిగాడు.

'మనమా? ... ఎక్కడికన్నాపోదాం బాబూ! ఈ ఊరు వదలి పోదాం!.... ' అని చెప్పాను.

'నాన్నా....'

'ఊఁ...'

'ముంతాజ్‌ని కూడా తీసుకు వెళ్దాం నాన్నా' అన్నాడు వేణు.

నేనే సమాధానమూ వెంటనే చెప్ప లేకపోయాను.

తర్వాత - 'సరే, తీసుకువెళ్దాం!....పద!' అన్నాను.

నాలుగు గుడ్డలూ, రెండు గిన్నెలూ అవీ మూట కట్టుకున్నాం. బాగా చీకటి పడింది.

ఎక్కడికి వెళ్లాలో నిశ్చయంగా తెలీదు. మంచి చోటుకు వెళ్ళాలి! ఆ చీకట్లో ముగ్గురం బయలు దేరేం ఎటువెళ్తున్నామో కూడా తెలీదు. వెళ్తున్నాం. మంచి చోటెక్కడ?

# పార్వతి కథనం

నన్నే పార్వతి అంటారు. నాకు నా అన్నవాళ్ళెవరూలేరు. బస్తీలో చిన్న డాబా ఉంది. అందులోనే చిన్న హోటలు పెట్టుకున్నాను. అదే నా ఇల్లు. అదే నా జీవనోపాధి. తిండికీ, బట్టకీ కొదవలేదు. ఆ హోటలు మీద వచ్చే డబ్బులు నాకు సరిపోతాయి.

నా అన్నవాళ్ళెవరూ లేరు అనే విచారం తప్పిస్తే నాకీ జీవితంలో మరేచింతా లేదు.

నిజానికి నా అన్నవాళ్ళు ఉన్ననాటి కంటే లేని నాడే సుఖపడుతున్నాను నేను.

అబ్దుల్లా బస్తీలో జేబుదొంగ. వాడూ, వాడి ముఠా కూడా నా హోటల్లోనే భోజనం చేసేవారు.

సరే మన హోటల్ లోనే భోజనం చేస్తున్నారుకదా అని, ఎక్కడికి పోతారులే అనే ఉద్దేశంతో అతగాడికీ, అతని ముఠాకీ అప్పు పెట్టాను.

ఇప్పటికి రెండు నెలలై-అతనూ, అతని ముఠా నా హోటల్లో భోజనం చేస్తున్నారు. కానీ, ఇంతవరకూ పైసా కూడా ఇవ్వలేదు. రోజూకూడా 'రేపు' అని చెప్పడమే కానీ, ఇవ్వడం కనిపించలేదు.

పదిరోజుల్నుంచీ ఆ మాటకూడా మానేసి - ఖాతరు చేయకుండా అదోలా నవ్వేసి వెళ్ళిపోవడం మొదలెట్టాడు.

అందుకే ఇవాళ డబ్బులిస్తేగాని విస్తరి వెయ్యనని చెప్పాను.

'ఏం పార్వతమ్మా! డబ్బులు ఇస్తేగానీ అన్నం పెట్టవా?' అన్నాడు అబ్దుల్లా.

'పెట్టను! పచ్చి మంచినీళ్ళుకూడా ఇవ్వను అని ఖచ్చితంగా చెప్పేను.'

'పార్వతమ్మా! బాగా ఆలోచించి మరీ చెప్పు. నాతో తగువు పెట్టుకో మాక!' అన్నాడు అబ్దుల్లా.

'ఏం?... అన్నీ ఆలోచించే చెబుతున్నా!..... నీ బెదిరింపులకు జడిసిపోవడానికి నేనేం పల్లెటూరి పిల్లనికాను' అని చెప్పాను.

'అబ్బోసి... వ్యవహారం అంతవరకూ వచ్చిందా యేం?'

'ఇదిగో, ఈ పప్పులేం నా దగ్గర ఉడకవు! డబ్బులుంటేనే ఇచ్చి అన్నం తిను! లేక పోతే, అదిగో... దారి' అని వీధి చూపించాను.

'అయ్యయ్యో!... అబ్దుల్లాతో ఇన్నాళ్ళు సావాసం చేసినా అబ్దుల్లా సంగతి తెలీదా పార్వతమ్మా!

'ఛీ... నీతో నాకేం సావాసం?.... రోజూ నీలాంటి వాళ్ళు లక్షమంది వచ్చి తిని పోతుంటారు. వాళ్ళలో నువ్వొకడివి' అన్నాను.

'పార్వతమ్మా... నేనసలే చెడ్డవాణ్ని. నాతో తగవు పెట్టుకో మాక!... అయినా, మనలో మనకేంటి? డబ్బులు నిదానంగా ఇస్తాలే!' అన్నాడు అబ్దుల్లా అసహ్యంగా నవ్వుతూ.

'అబ్దుల్లా... కొంచెం దూరంగా ఉండి మాట్లాడు. ఈ పోకిరీ వేషాలు మనదగ్గర సాగవు!'

'నేను పోకిరీనే! కాని, నువ్వు కూడా మహా పతివ్రతవుకావు...' అన్నాడు అబ్దుల్లా మరింత దగ్గరకొచ్చి.

'ఛీఛీ... దూరంగా పో.... దగ్గరకొస్తే' అని చెయ్యెత్తాను.

'అబ్బ... ఏదీ ఏంచేస్తావో చెయ్యి'.... అంటూ గభాలున చెయ్యి పుచ్చుకున్నాడు.

దాంతో వళ్ళుమండి గూబ గీ.... మనేలాగ చాచి పెట్టి చెంపమీద కొట్టేను.

వెంటనే చెయ్యివదిలి 'హు... అంతవరకూ వచ్చిందేం

వ్యవహారం! చూడు... ...' అంటూ ఎదురుగా ఉన్న బల్లని ఫెడీమని తన్నేడు.

దాని మీదున్న గ్లాసులూ అవీకింద పడిపోయాయి. ఓ గ్లాసులో నీళ్ళు తుళ్లి పక్కనే భోజనం చేస్తున్న ఒక పరదేశీ విస్తట్లో పడ్డాయి.

అతన్ని నేను వచ్చిన దగ్గర్నుంచి చూస్తూనే ఉన్నాను. చాలా మంచివాడిలా ఉన్నాడు.

అంత మంచివాడు కూడా తన విస్తట్లో నీళ్ళు పడగానే అంత లేసి కళ్ళుచేసుకొని లేచి నించున్నాడు. ఆ కళ్లను చూసే సరికి నాక్కూడా భయం వేసింది.

'ఇంక చూడు....' అంటూ అబ్దుల్లా మరో బల్లని తన్నబోయే సరికి-

'ఆగు...' అంటూ అరిచాడు ఆ పరదేశి.

అబ్దుల్లా తుళ్ళిపడి, పరదేశిని చూసి 'ఎవడ్రా నువ్వు?' అన్నాడు.

'నీ మొగుణ్ని.....' అన్నాడు పరదేశి.

అంతే మరుక్షణంలో ఒకరిమీద ఒకరు కలబడి పోయారు.

నాకు భయంవేసింది. ఈ రాక్షసుడితో అనవసరంగా తగువు తెచ్చుకున్నానే అనిపించింది.

అబ్దుల్లా పరదేశిని నాలుగు గుద్దులుగుద్ది, తోసేశాడు. కుర్చీ ఎత్తి తలబద్దలు కొట్టబోయే సరికి పరదేశి తప్పించుకొని - ఒక్క పిడిగుద్దుతో అబ్దుల్లాని వీధిలోకి తోసేడు.

ఆ తర్వాత, అబ్దుల్లా తిన్న దెబ్బలకి మరొకరయితే అక్కడికక్కడే చచ్చి ఉండేవారు.

చిత్తుగా చితకగొట్టి 'డబ్బుల్లేకుండా పార్వతమ్మ హోటల్‌కు రాను' అని అబ్దుల్లాచేత అనిపించాడు పరదేశి.

అబ్దుల్లా, అతగాడి అనుచరులూ ఒక్క క్షణం కూడా ఉండకుండా పారిపోయారు!

పరదేశిని చూసి జనం భయపడ్డారు. అబ్దుల్లా మీద కోపం ఉన్నవాళ్ళంతా ఎంతో సంతోషించారు.

'మీ మేలు ఈ జన్మలో మర్చిపోలేను! నా జీవనాన్ని కాపాడేరు...' అని కృతజ్ఞత చెప్పుకున్నాను నేను పరదేశికి.

'అబ్బే ఇంతమాత్రానికేనా! మనుషులం అన్న తర్వాత ఒకరికొకరు సహాయ పడకపోతే ఎలా?' అన్నాడు పరదేశి.

తర్వాత, అతను మరి భోజనం చేయలేదు, ఆయనతో వచ్చిన పిల్లలిద్దరూ మాత్రం అన్నం తిన్నారు.

'ఈ పిల్లల్ని కొంచెం చూస్తారా?... నేను అలా ఉళ్లోకి వెళ్ళివస్తాను' - అని అడిగాడు పరదేశి.

సరే! వెళ్లిరమ్మన్నాను. ఆ పిల్లల్ని నాకు అప్పజెప్పి వెళ్లి పోయాడు.

ఆ పిల్లలలో ఆడపిల్ల పేరు ముంతాజ్. మగ పిల్లాడి పేరు వేణు. ఆ పేర్లు వినేసరికి నాకు ఆశ్చర్యం వేసింది.

కాని, వేణు అనే కుర్రాడు చెప్పిన సంగతులన్నీ విన్న తర్వాత కథంతా అర్థం అయింది.

అయితే, ఇప్పుడతను వెళ్లింది ఉద్యోగం కోసం అన్నమాట.

వాళ్ళు ఉంటున్నది ఊరికి దూరంగా ఉన్న దయ్యాలమేడ. ఎప్పుడో నేను పుట్టకముందు జమీందారుగారి బంగళా అది! తర్వాత, జమీందారుగారూ వాళ్లూ చచ్చిపోయాక - అది దయ్యాల మేడ అయింది. పగలు కూడా అందులోకి ఎవరు వెళ్ళేవాళ్ళుకాదు.

ఇప్పుడు వీళ్లు అది ఖాళీగా ఉందని అందులోనే దిగారట!... సరే ఇలాంటి సమయంలో వాళ్ళకి దాన్ని గురించి చెప్పి బాధ పెట్టడం అంతమంచిది కాదను కున్నాను.

ఊరంతా తిరిగి తిరిగి వచ్చాడు పాపం అతను. ఎక్కడా ఉద్యోగం దొరకలేదుట -

'రోజూ భోజనానికి ఇక్కడికే వచ్చేయండి! ఉద్యోగం వచ్చేక బాకీ తీరుద్దురుగాని' అని అతనికి చెప్పి, సరేనని ఒప్పించాను.

ఊరికి, దయ్యాల మేడకి మధ్యన పెద్దకొండలోయ ఉంది. ఆ లోయలో పెద్ద బందిపోటుదొంగల ముఠా ఈ మధ్యనే

వచ్చి చేరింది.

అంచేత, రాత్రిపూట ఎంతమాత్రం అటు రావద్దని అతనికి మరీ మరీ చెప్పాను. 'మరో అడ్డదారి ఉంది. కానీ, నేను మీ ఇంటికి వచ్చినప్పుడు చూపిస్తాను.' అని కూడా చెప్పాను.

చెప్పినట్లుగానే వారంరోజుల తర్వాత ఒకనాడు అతనితో కలిసి దయ్యాలమేడకు వెళ్లాను.

ఆ ముగ్గురూ కలిసి ఆ మేడని ఎంతబాగానో చేసుకున్నారు. ముందు ఏవేవో పూలమొక్కలు అవీకూడా వేశారు. లోపలి గదులన్నీ కూడా బాగా సర్దుకున్నారు.

నా చిన్నతనంనుంచీ కూడా పగలు అటువెళ్ళటానికి జనం భయపడేవారు.

అతను నాగురించి అడిగాడు.

నా జీవితంలో ఇన్నాళ్ళకి నాగురించి తెలుసుకోవాలనుకొన్న వ్యక్తి ఇతనే కనిపించాడు.

నా విషాదగాధ వినిపించి, కళ్ళనిండా నీళ్ళు నింపుకోడానికి - ఆ నా ాధంతా వెళ్ళగక్కుకోడానికి ఇవాళ అవకాశం కలిగింది నాకు -

తల్లి కడుపులో పడగానే తండ్రి చచ్చిపోయాడు. భూమిమీద పడగానే తల్లి చచ్చిపోయింది.

నన్ను పెంచిన వాడు పినతండ్రి.

పదేళ్ళదాన్ని అయాక-డబ్బుకోసం ఆశపడి - నా తాగుబోతు పినతండ్రి నన్ను ముసలాడికిచ్చి పెళ్ళిచేశాడు.

పెళ్ళయిన మరుసటి సంవత్సరమే ఆ ముసలాడ్ని ఎవరో హత్యచేశారు.

నాకు బాగా జ్ఞానం వచ్చేవరకూ, సుమారు అయిదేళ్ళపాటు అతని హత్యను గురించి కేసు జరిగింది.

తర్వాత - నాకు రావలసిందేమీ లేదని తేలింది. ఆస్తి అంతా ఎలా హరించుకుపోయిందో కానీ, కొంత కోర్టుకి ఖర్చు అయినట్టుమాత్రం తెలుసు.

మిగతాది ఏమయిందో - ముక్కూ మొగం ఎరుగని ఆ

ముసలాడి వారసులకూ, మా చిన్నాయనకూ తెలుసు.

ఏమయితేనేం - చిన్నాయన బాగుపడ్డాడు. ఆ డబ్బు తీసుకొని హాయిగా ఎక్కడికో ఎగిరిపోయాడు. మిగతా ఇల్లు అతని వారసులు స్వాధీనం చేసుకున్నారు.

నేను ఏకాకిని అయ్యాను.

అయితే, అదృష్టవశాత్తూ నా దగ్గర 'బంగారు కాసుల పేరు' ఉండిపోయింది. అది వాళ్ళకి ఇవ్వడం మర్చిపోయాను.

ఆ నగ బజారులో అమ్మగా వచ్చిన డబ్బుతో ఇప్పుడు ఉన్న డాబా కొన్నాను. ఇరుగూ పొరుగూ సలహాతోటే చిన్న హోటలు కూడా పెట్టుకున్నాను.

అదే నా జీవనోపాధి. ఆ హోటలు వల్లనే ఇలా జీవిస్తున్నాను. కానీ, మళ్లీ పెళ్లిమాత్రం చేసుకోలేదు.

నామీద సానుభూతి చూపించిన వాళ్లూ, నా కష్టాలకు జాలి పడ్డవాళ్లు చాలామంది బాధపడ్డారు. కానీ, నన్ను పెళ్లి చేసుకునేందుకు మాత్రం భయపడ్డారు. ఈ విషయంలో నేను ఎవర్నీ బలవంతం చెయ్యలేదు!

కారణం

నేను విధవనని. పైగా నాకు 'దరిద్రదేవత' అని జనం అంతా కలిసి బిరుదు ఇచ్చారు. నిజమే - అలా అనడంలో కూడా తప్పులేదు.

పుట్టకముందే తండ్రిని - పుట్టి తల్లినీ - పెళ్ళాడి భర్తనీ పొట్టన పెట్టుకున్న నన్ను ఎవరు పెళ్లి చేసుకుంటారు? చేసుకుంటాం అని అన్నా - నాకు భయమే !

నా కథని విని కన్నీళ్ళుకార్చినవాడు అతనొక్కడే!...

దేవుడు మంచివాళ్ళను మరింత బాధిస్తాడు. చెడ్డవాళ్లకి మరిన్ని చెడ్డపనులు చెయ్యడానికి అవకాశం ఇస్తాడు -

అతనికి ఉద్యోగం ఇప్పించమని రోజూ దేవుణ్ని ప్రార్థిస్తున్నాను.

అతనికి ఏదో ఒక ఉద్యోగం దొరికితే అతని జీవితం ఒడ్డున పడుతుంది. కానీ దొరికేదెలా?

# భీముడి కథనం

నేనూ, వేణు, ముంతాజ్ ముగ్గురంకూడా రెండు రోజులు ప్రయాణం చేసి ఓ ఊరు చేరుకున్నాం.

ఊరి చివర్న మాకు ఓ పెద్ద పాతమేడ కనిపించింది. ఆ మేడ ఎవరిదోయేమో......కాని చాలా పాతది. సరే, అందులోనే నివాసం ఏర్పర్చుకున్నాం.

ఒక రోజల్లా కూడా ముగ్గురం కష్టపడి ఆ పాడు బడ్డ ఇంటిని బాగుచేసుకున్నాం. ఆ ఇంటికి దగ్గరగానే బావి కూడా ఉండటం వల్ల నీళ్ళకు కూడా మాకు ఇబ్బంది కలగలేదు.

చక్కని ఇల్లయితే అద్దెలేకుండా దొరికింది కాని , ఆ చుట్టు పక్కల నర వాసన అన్నది లేదు. ఇంటికి ఊరు కూడా దూరంగానే ఉంది.

ఆ మర్నాడు ఉన్న గిన్నె, ముంతా అవీ లోపల పడేసి ఆ ఇద్దరు పిల్లల్ని తీసుకుని ఊళ్లోకి వెళ్ళేను.

ఊళ్ళో అనుకోకుండా హోటలు యజమాని పార్వతమ్మతో పరిచయం ఏర్పడింది.

ఆమెకు కష్టాలంటే ఏమిటో బాగా తెలుసు. అందువల్లనే ఆమె నా కష్టాల్ను అర్థం చేసుకుంది.

తర్వాత -

నాకు ఉద్యోగం దొరికేంతవరకూ తన హోటల్లో ఖాతా

ఇస్తానంది. చాల సంతోషించాను. దేవుణ్ని నమ్ముకునందుకు ముష్టి ఎత్తుకునే పరిస్థితి ఏర్పడకుండా పార్వతమ్మ దేవతలా వచ్చి మమ్మల్ని ఆదుకుంది.

పిల్లలిద్దరికీ పార్వతి దగ్గర బాగా చనువు అయింది. పార్వతి కూడా పిల్లలంటే ప్రాణం.

కానీ, నాకుమాత్రం వేణూ వాళ్ళ అమ్మ గురించీ, పసిదాన్ని గురించీ తలచుకున్నప్పుడల్లా ముంతాజ్ మీద కోపం వచ్చేది.

ఒకటి రెండు సార్లు ముంతాజ్‌ని ఎక్కడికైనా వెళ్ళి పొమ్మని చెప్పేను. బస్తీలో వదిలేస్తాను నీకు ఎవరూ లేరని తెలిస్తే ఎవరయినా పెంచుకుంటారు. వెళ్ళిపొమ్మని చెప్పేను. కానీ వినలేదు.

వేణూని విడిచి ఉండలేనంది. కాళ్ళా వేళ్లాపడి బతిమలాడింది. నా ప్రయాస వృధా అయింది.

ఒకనాడు మాత్రం ముంతాజ్‌ని చాలా గట్టిగా కొట్టాను. కారణం కూడా లేకపోలేదు ఉంది.

నేను వరండాలో చుట్ట కాల్చుకుంటున్నాను. గతం తలుచుకొని విచారిస్తున్నాను.

వేణూ, ముంతాజ్ అక్కడే ఆడుకుంటున్నారు.

ఇంతలో ముంతాజ్ ఎక్కడనించో ఓ జామకాయ తెచ్చింది.

తెచ్చింది ఊరుకుందా-

కటుక్కున కొరికి ఓ ముక్క వేణుకి ఇచ్చింది. వేణు ఆ ముక్క పుచ్చుకుని నోటిలో వేసుకున్నాడు.

నాఒళ్ళు మండిపోయింది. గభాలునలేచి 'ముంతాజ్' అని కేకేసి చాచి పెట్టి చెంపదెబ్బ కొట్టేను.

'ఏదో ఎవరూ లేరని ఆదరిస్తే నీ ఎంగిలి సైతం తినిపిస్తావా?....'అని కసిరేను.

'ఈ సారి ఇలాంటి పనులు చేస్తే ఇంట్లోనుంచి తగిలేస్తాను. తెలిసిందా...!' అని హెచ్చరించాను.

'నాన్నా! నన్నుకూడా కొట్టు నేను కూడా తప్పుచేసిన వాణ్నే....!' అన్నాడు వేణు.

'ఏమిట్రా నువ్వనేది?'

'అవును నాన్నా! నేనిప్పటికి పదిసార్లన్నా ఎంగిలిచేసిన వస్తువులు ముంతాజ్‌కి ఇచ్చాను. అందుకనే, ముంతాజ్ నాకిచ్చింది' అన్నాడు. నాకేం పాలుపోయింది కాదు.

'వేణు....నన్ను వెర్రెత్తించక లోపలికి పో....' అని లోపలికి వెళ్ళిపోయాను.

కోపంలో కొట్టేనేకాని-ముంతాజ్‌కి చెంపమీద నా నాలుగు వేళ్ళూ వాతలు తేలి..... కనిపించినంత సేపూ విచారించేను.

'ఛ.....పసిపిల్లమీద అన్యాయంగా చెయ్యి చేసుకున్నాననిపించింది. ఇకముందు పిల్లల్నిద్దర్నీ కూడా కొట్టకూడదని అనుకున్నాను.

* * *

ఆ తర్వాత మరోనాడు వేణూకి జ్వరం వచ్చింది. పార్వతి వచ్చి చూసి మందు కూడా తెచ్చి ఇచ్చింది.

అన్నం తినమని బతిమాలేను. కానీ, తినలేదు.

ఆరాత్రి ముంతాజ్ వేణూ కాళ్ళదగ్గరనే అలాకూర్చుంది. పడుకోమని చెప్పేను.

నేను కొంచెం దూరంగా పక్కవేసుకొని పడుకున్నాను.

అర్థరాత్రి తెలివి వచ్చి చూసేసరికి ముంతాజ్ కనిపించలేదు.

ఎక్కడికి వెళ్ళిందా అని గాభరా పడ్డాను.గభాలున లేచి బయటకు వచ్చి చూశాను.

ముంతాజ్ వరండాలో పడమటి వైపుకి తిరిగి మోకాళ్ళ మీద కూర్చొని-

'ఇర్రహిమాన్

'భిస్మిల్లా'

ఇర్రహిమాన్

ఇబ్రహీం' అని సమాజ్ చేస్తోంది.

చాఛా....ఏమిటీ తురకగోల అనిపించింది. 'ముంతాజ్' అన్నాను,

ముంతాజ్ గతుక్కుమని -లేచి నించుంది.

'ఏమిటిగోల.....'

'......వేణూకి జొరం తగ్గాలని అల్లాని ప్రార్థిస్తున్నాను.....'.అంది.

'వీల్లేదు! వెళ్లు....' అని కసిరేను.

ముంతాజ్ కళ్ళనిండా నీళ్ళు నింపుకొని వెళ్ళిపోయింది. ఈ గోలకి వేణు లేచినట్టుంది.

ముంతాజ్ వాడిదగ్గరకు వెళ్ళి కూర్చుంది. వాడు సంగతి అర్థంచేసుకున్నాడల్లే ఉంది.

'పోన్లే ముంతాజ్!....నా జ్వరం తగ్గిందిలే!.....అయినా, మీ దేవుడూ, మా దేవుడూ అని ఇంతమంది దేవుళ్ళు లేరుట! దేవుడు ఒక్కడే!......పేర్లు మాత్రం చాలా ఉన్నాయట! పార్వతి పిన్ని అబద్దం ఆడదు! ఇలా అని తనే చెప్పింది. నువ్వేం బాధపడకు!' అంటూ కళ్లు తుడిచి ఓదార్చాడు వేణు.

ఆ మాటలు విన్నాక నాకు అనుమానం వేసింది. ఇంతకీ దేవుడు ఒక్కడా ఇద్దరా అని.

ఏమయినా 'ఒక్కడే' అన్నదాన్ని మనసు బలపర్చుకో లేకపోయింది. ఈ సారి నేను పిల్లల మీద చెయ్యేకాదు..... నోరుకూడా చేసుకోనని ఒట్టువేసుకున్నాను.

* * *

నాకు దినం ఒక యుగం అనిపించింది. కారణం ఉద్యోగం లేకపోవడమే! నేను అడక్కుండా పార్వతి అన్ని సదుపాయాలూ చేసిపెట్టేది. కానీ, ఎన్నాళ్ళని ఇలా ఆడదాని అర్జన తింటూ కూర్చోడం?.....

పార్వతి మాత్రం- 'నాకు ఉద్యోగం లేదు' అని విచారించి

నప్పుడల్లా గట్టిగా కసిరేది.

'ఇప్పుడు మీరు ఉద్యోగంచేసి ఎవర్ని పోషించాలి? నేనూ కష్టపడుతున్నాను చాలదూ? మీరుకూడా కష్టపడాలా?' అనేది.

మళ్ళీ తానే- 'ఉద్యోగం అవుతుంది. దేనికయినా కాలం కలిసిరావాలా!' అని ఓదార్చినట్లు అని-

'ఏం.....నావల్ల మీకు ఇబ్బంది కలుగుతోందా?' అని శూలంతో గుచ్చినట్లు అడిగేది.

'పార్వతీ! మీవల్ల నాకే ఇబ్బందీ లేదు. కానీ నువ్వనే మాటలు మాత్రం గుండెల్లో గునపాల్లా గుచ్చుకుంటున్నాయి. సుమా!....' అన్నాను.

'లేదు, క్షమించండి!....' అనేది.

నేనూ, పార్వతీ, వేణూ, ముంతాజ్ నలుగురం కలిసి అప్పుడప్పుడు అలా షికారు వెళ్ళేవాళ్ళం-

మా ఇంటికి కోద్దదూరంలోనే కొండరాళ్ళూ, అల్లిబిల్లి అడవులూ ఉన్నాయి.

అక్కడపచ్చిక మైదానంలో గంటలు తరబడి కూర్చునేవాళ్ళం.

నేనూ, పార్వతీ ఏవో తియ్యటి సంగతులు చెప్పుకొనేవాళ్ళం.

అలా షికారు వెళ్లినప్పుడల్లా పార్వతి నాతో-

'ఇప్పుడు ఈ ఉద్యోగ ప్రయత్నం ఎందుకు చెప్పండీ.....! ఈ హోటల్‌నే మనమిద్దరం కలిసి నిర్వహించుకొందాం. అలా అయితే హాయిగా ఉండదూ?....' అనేది.

నేను మాత్రం ఏమీ సమాధానం చెప్పేవాణ్ని కాదు. వినీ విననట్టు ఊరుకునే వాణ్ని.

* * *

ఓ నాడు అర్ధరాత్రి సమయంలో ఇంటికి వెళుతున్నాను. పిల్లలిద్దరూ ఆవేళ పార్వతి దగ్గరే ఉండిపోయారు. కానీ, నేను మాత్రం ఉండమని బలవంతం చేసినా, ఉందామని అనిపించినా

కూడా వచ్చేశాను.

సగం దారిలోకి వచ్చేసరికి- ఎవరో నలుగురు మనుషులు కర్రలతో సహా నా మీద గభాలున పడ్డారు.

ఇద్దరు నా రెండుచేతులూ బలంగా వెనక్కి తిప్పి పట్టుకున్నారు.

"నీ దగ్గర డబ్బేమన్నా ఉంటే ఇచ్చేయ్" అన్నారు.

అప్పుడు అర్థమయింది-పార్వతి చెప్పే బందిపోటు దొంగలు వీళ్లేనని. "సరే వదిలి పెట్టండి-ఇస్తాను" అన్నాను. చేతులు వదిలేశారు. వదిలీ వదలడంతో నలుగుర్నీకూడా ఒక్క దుముకులో నాలుగువైపులా తోసి-చేతికర్ర అందుకున్నాను.

బందిపోటుదొంగలు కావడంచేత వాళ్లని ఎదుర్కోవడం కొంచెం కష్టం అయింది.

నాకు చిన్న చిన్న దెబ్బలే తగిలాయి కానీ, వాళ్లని మాత్రం చిత్తుగా చితక కొట్టేను.

దాంతో వాళ్లల్లో ఒకడు దూరంగా పారిపోయి-బిగ్గరగా ఈలవేశాడు. ఈల వేసిందే తడవుగా గబగబా పది, పదిహేను మంది కర్రలతో, కత్తులతో నామీద పడ్డారు.

నేను వాళ్లచేతుల్లో చిక్కుకున్నాను. నా చేతులు వెనక్కి తిప్పి కట్టేరు. కళ్లకి గంతలు కట్టి ఎక్కడికో తీసుకువెళ్లారు.

బహుశ వాళ్ళ నివాసానికి అయి ఉంటుంది.

లోపలకు వెళ్ళాక కూడా నా గంతలు విప్పలేదు. వాళ్ల నాయకుడికి నన్ను బాటసారిగా పరిచయం చేశారు. ఒక్కణ్ణే నలుగుర్ని ఎదుర్కొన్న సంగతి చెప్పేరు.

అదివిన్న నాయకుడు "సెభాష్!...అంత వీరుడా?" అంటూ నవ్వేడు. తర్వాత-

"ఎవరు నువ్వు? ఎక్కడ ఉంటున్నావు? ఏఊరు నీది?" అని అడిగాడు.

"సమాధానం మర్యాదగా అడిగితేనే వస్తుంది. లేకుంటే ఈ జన్మలో నా నుంచి సమాధానం రాదు"అని చెప్పేను.

"ఓ....గట్టిమనిషే?-సరే, ఇలా కూర్చోండి!....ఇప్పుడు చెప్పండి ఏఊరు మీది?" అని అడిగేడు నాయకుడు.

"మాది ఈ ఊరే!" అంటూ, మేం ఉంటున్న మేడ గుర్తులు చెప్పేను.

"నేను ముందే అనుకున్నా, గుండెబలం, కండబలంగల వారని-మీరు ఏ ఉద్యోగం చేస్తున్నారు?" అని అడిగేడు.

"ప్రస్తుతం వెతుకుతున్నాను"

"ఇంకేం, చాలా సంతోషం మీలాంటివాళ్ళు మా ముఠాలో ఉండడం ఎంతయినా అవసరం. కాబట్టి మీరేమంటారు?. .." అని అడిగాడు.

"చెయ్యనంటాను"

"ఏం....మీరు మరే ఉద్యోగం చేసినాకూడా ఇంత ఆదాయంరాదే." అన్నాడు నాయకుడు.

"అది నాకూ తెలుసు. కానీ, నాకీ ఉద్యోగం అఖ్కర్లేదు....అంత పెద్ద ఆదాయమూ అఖ్కర్లేదు...." అని చెప్పాను.

"దారా! చేత్తానని అనిపించమన్నారా...." ఎవరో కొరడా ఝుళిపించారు.

నాయకుడు మాత్రం "వద్దు వద్దు!...ఆయన్ని- జాగ్రత్తగా తీసుకువెళ్లి వదిలేయండి...."అని చెప్పి- నన్ను కేకేసి-

"మీకు ఎపుడు అవసరమయితే అపుడే రండి!...మీ ఉద్యోగం మీకోసం ఖాళీగానే ఉంటుంది" అని చెప్పేడు.

"ఛీ...చెయ్యక చెయ్యక బందిపోటు దొంగతనమా?-" అని నాలో నేనే ఛీదరించుకొన్నాను.

నన్ను వాళ్ళు బయటకు తీసుకువచ్చి - గంతలు తీసేశారు.

"ఇదిగో దారా! కొడితే కొట్టావుగాని మాజబ్బబలం గల వాడివి....నీ కోసం ఎదురుచూస్తుంటాం" అన్నాడు ఒకడు.

నాకు నవ్వువచ్చింది. మెల్లగా ఇంటికి చేరుకున్నాను.

మొత్తంమ్మీద ఆ బందిపోటు ముఠాతో పరిచయం అయిన

దగ్గర్నుంచీ కూడా నా మనసు మనసులోలేదు.

చేరితే బావుంటుందేమోననిపించింది. కానీ, పాపభీతి మాత్రం నన్ను భయపెట్టింది.

ఈ సంగతి మాత్రం ఎవరికీ చెప్పలేదు నేను.

ఆ దారంట వెళ్ళవద్దని పార్వతి వచ్చిననాడే చెప్పింది. అంచేత ఆమెకు కూడా చెప్పలేదు నేను.

* * *

రోజులుమాత్రం గడిచిపోతున్నాయి కానీ, ఉద్యోగం దొరకలేదు. అదేం పాపమో మరి....

ఓ నాడు నేను పార్వతి దగ్గరకు వెళ్ళాను.

పార్వతి అప్పుడే తన చేతికిఉన్న రెండు జతల బంగారం గాజులు తీసి తాకట్టు పెట్టమని పనిమనిషికి ఇస్తోంది.

"చివరికి గాజులుకూడ పెట్టేస్తారా అమ్మా!...." అన్నది పనిమనిషి.

"పోనిద్దూ....ఆయనకి ఉద్యోగం అయినాక మళ్ళీ అన్నీ కొనుక్కోవచ్చులే" అది పార్వతి.

"ఆయనంటే మీ కెందుకమ్మా అంత ప్రాణం?" అన్నది. పనిమనిషి నవ్వుతూ "పోవే"పార్వతి సిగ్గుపడిపోయింది.

"పోనీలే అమ్మా.....ఈ మబ్బు ఇయాళ ఉంటుంది. రేపు పోతాది...ఆ బాబు మిమ్మల్ని కట్టుకుంటే అదే పదివేలు.ఎప్పుడో మీ చిన్నతనంలో చూశాను మీ నవ్వు! మళ్లీ ఇయాళ సూశాను" అంది పనిమనిషి. పార్వతి మరింత సిగ్గుపడిపోయింది.

నేను గబగబా అలికిడి కాకుండా పార్వతికి తెలీకుండా వచ్చేసి ఇల్లు చేరుకున్నాను.

పార్వతి నా కోసం ఇన్ని బాధలు పడడం చూసేసరికి, నాకు బాధవేసింది. పైగా నా మీద, నా ఉద్యోగం మీద ఇన్ని ఆశలు పెట్టుకున్నదని నాకు ఇవాళ్టి వరకూ తెలీదు.

ఈ సంగతే నన్ను కలవరపెట్టింది. ఓ నాడల్లా మంచం ఎక్కించింది. ఆ రోజు పార్వతి హోటలు కూడా నా మాట వినకుండా కట్టేసి నా దగ్గరే ఉండిపోయింది. దాంతో నేను పూర్తిగా బలహీనుడ నయ్యాను.

పాపంలేదు-పుణ్యంలేదు-పాపం అనుకుంటే-ఇంతకంటే వేరే పాపమే లేదనిపించింది. ఎవరో ముక్కూ మొగం తెలియని అమాయకురాలిని పెట్టే బాధకంటే....

బందిపోటు దొంగతనమే మంచిదని నిశ్చయించుకున్నాను.

ఆ మర్నాడేవెళ్ళి బందిపోటు ముఠాను కలుసుకున్నాను.

"మీరు వస్తారని నాకు తెలుసు" అన్నాడు నాయకుడు.

తక్షణం ఉద్యోగం అయింది. ఉద్యోగం అర్ధరాత్రి నుంచి, తెల్లవారుఝామువరకూ మాత్రమే! పగలు అసలు వెళ్లనక్కరలేదు. పగలు ఊరికే వాళ్ళంతా రమ్మన్నారు. కానీ, పగలు అసలు ముందేచెప్పాను. "సరే" నన్నారు వాళ్ళు.

ముఠాలోచేరిన మూడోనాటినుంచీ చేతిలో డబ్బులు ఆడేయి.

ఆ వారంలోనే వేణూకి, ముంతాజ్‌కి బట్టలూ, పార్వతికి రెండుజతల బంగారుగాజులూ తీసుకున్నాను.

జీవితం ఇప్పుడు కొంచెం హాయిగా గడిచిపోతోంది.

పార్వతి రెండు మూడుసార్లు "ఏం ఉద్యోగం చేస్తున్నారూ" అని అడిగింది. కానీ, నేను మెల్లగా మాటమార్చేసేవాణ్ణి.....

ఓనాడు పార్వతితో కొన్ని ముఖ్యమయిన సంగతులుకూడా మాట్లాడాను. రోజులు హాయిగా దొర్లిపోతున్నాయి.

# వేణు కథనం

నాన్నకి ఉద్యోగం అయిన తర్వాత అందరం సంతోషంగానే ఉంటున్నాం.

కానీ, నాన్న ఏం ఉద్యోగం చేస్తున్నాడో మాత్రం తెలిసిందికాదు. అడిగినా కూడా చెప్పలేదు.

రోజూ అర్ధరాత్రి వెళ్ళిపోయి, తెల్లవారుతూండగా ఇంటికి వచ్చేవాడు.

నాన్న రోజూకూడా నన్ను పడుకోబెట్టి - నేనూ, ముంతాజ్ నిద్రపోయిన తరువాత తాను వెళ్ళిపోయేవాడు.

ఏమయినా సరే నాన్న రాత్రిపూట ఎటు వెళుతున్నాడో-ఏం ఉద్యోగం చేస్తున్నాడో తెలుసుకోవాలని అనుకున్నాను.

నాన్న మామూలుగా నన్ను నిద్రపుచ్చేడు. నేను మాత్రం నిద్రపోయినట్టుగా నటించాను.

నాన్న లేచి, బట్టలు మార్చుకొని. పెట్టె తీసి అందులోంచి పెద్ద 'బాకు' ఒకటి తీశాడు.

అలాంటి బాకు నాన్న దగ్గర ఇదివరకెప్పుడూ చూడలేదు నేను. ఎలావచ్చిందో మరి!....

ఒరలోనుంచి బయటకు తీసేసరికి తళుక్కుమంది! అది మొలలో పెట్టుకొని, తలుపు దగ్గరగా వేసుకొని వెళ్లిపోయాడు.

నాన్నని బయటికి వెళ్ళనిచ్చి-గబగబా చొక్కా వేసుకొని, మెల్లిగా

తలుపు తీసుకొని బయటికి వెళ్ళాను.

చీకటి, కీటురాళ్లు కీమంటున్నాయి. భయం భయంగా ఉంది. ఆ చెట్లలో నడవడానికి ధైర్యం చాలింది కాదు. లేని ధైర్యం తెచ్చుకొని-నాన్నకి తెలీకుండా, అలికిడికాకుండా, కనిపించకుండా నాన్నని అనుసరించాను.

అలా కొంతదూరం నడిచాను. వెళుతున్నప్పుడే ఎటువెళ్తున్నదీ-ఏపక్కకు తిరుగుతున్నదీ అన్నీ కొండ గుర్తులు పెట్టుకుంటున్నాను.

ఆ తుప్పల్లో పాములూ అవీ ఉంటాయేమోనని భయం!. ... గుండె దడదడ కొట్టుకుంటోంది.

ఇంతలో పెద్ద అలికిడి అయింది.

ఎవరో నలుగురు మనుషులు పెద్దమూట తీసుకొనినాన్నకి ఎదురు పడ్డారు.

"ఎవరది?...." అని అరిచాడు నాన్న.

ఆ అరుపుకి తుళ్ళిపడ్డాను. ప్రాణం పోయినంత పని అయింది.

"అరె ....నువ్వాదొరా...." అన్నాడు ఆ నలుగురిలో ఒకడు.

"మీరా?....." అన్నాడు ఆశ్చర్యంగా నాన్న.

ఆ నలుగురిలో ఒకడు అగ్గిపెట్టె తీసి కాగడా ముట్టించాడు. వెలుగు వచ్చింది.

"ఏం దొరా ... ఆలస్యంగా వెళ్తున్నారు?"అన్నాడు ఒకడు.

"ఏం చెయ్యమన్నావ్?... ఎంత తొందరపడ్డా ఆలస్యం అవుతోంది-అది సరేకానీ, ఆ మూట ఏమిటీ? ..." అని అడిగాడు నాన్న, వాళ్లు కిందపెట్టిన పెద్ద మూటని చూసి.

"మనిషి....." అన్నారు వాళ్లు.

గుండె గతుక్కుమంది నాకు.

"బతికే ఉన్నాడా?...." అని అడిగాడు నాన్న.

'బతికివుంటే మొయ్యడం ఎందుకు దొరా? ... చచ్చేడు' అన్నారు వాళ్లు.

'చావలేదు సామీ! మనం చంపేం' అన్నాడు ఒకడు మీసాలు దువ్వుకుంటూ.

'ఏం ఎందుకని?' అడిగాడు నాన్న.

'అదికాదు సామీ! నేను చంటిపిల్లాడ్ని బతిమాలినట్టు బతిమాలేను. ఆ ఉన్నడబ్బు ఇచ్చేయమని కత్తికూడా చూపించి - డబ్బు ఇవ్వకపోతే చంపుతానని బెదిరించాను. ఊఁ హూ. ... ఇవ్వందే... వళ్లు మండి పోయింది ..... ఒక్కటే పోటు పొట్టలో పొడిచాను. చచ్చేడు....... ఇంతా చేస్తే వీడిదగ్గరున్నవి వందరూపాయలు, వంద రూపాయలయినా, వందదమ్మిడీలైనా మోత తప్పదుగా.... వీణ్ని ఆ లోయలో పారేసి వస్తాం... మీరు వెళ్ళండి' అన్నాడు వాడు.

దాంతో నాకు నాన్న చేసే ఉద్యోగం ఏమిటో అర్థం అయింది.

ఛీఛీ... ఇంత పాడు ఉద్యోగమా చేస్తున్నాడు.... దొంగతనం చేయడం పాపం అని చెప్పిన నాన్నే దొంగతనం చేస్తున్నాడు.

ఇంత పాపపు సొమ్మునా మేము తింటున్నాం... దోచుకున్న తిండి అరగదు.... అని చెప్పేవాడు నాన్న..... ఇప్పుడు అందరం కూడా అదే తింటున్నామా?...

నాకు అంతా అయోమయం అయిపోయింది..... అడుగు ముందుకు పడలేదు... ఏమిటో చెప్పలేని బాధ నన్ను మెలి పెట్టింది....

ఆ బాధతో నడుస్తున్న వాణ్ని గభాలున పడిపోయాను. ఆ అలికిడికి నాన్న నడుస్తున్నవాడల్లా ఆగిపోయి 'ఎవరక్కడ?' అన్నాడు.

గభాలున చెట్టుచాటున దాగున్నాను. నాన్న కొంచెం సేపు అక్కడే నుంచొని చుట్టూ కలయజూశాడు.

తర్వాత, అటుతిరిగి వెళ్ళిపోయాడు. నేను ఇటు తిరిగి ఇంటివైపు గబగబా నడిచాను. గుండె బిక్కూ బిక్కూమంటోంది. అడుగులు తడబడుతున్నాయి.

'ఎందుకొచ్చేను.....' అనిపించింది.

భయంతో దేవుణ్ని తలుచుకుంటూ గబగబా నడుస్తున్నాను.

నా వెనుక ఎవరో వస్తున్నట్టుగా అలికిడి అవుతోంది. కానీ, వెనక్కి తిరిగి చూసేందుకు ధైర్యం చాలింది కాదు.

ఇంటికి చేరుకొని తలుపు తీసుకొని లోపలికి వెళ్ళాను.

అంతలో మళ్ళీ తలుపు చప్పుడు అయింది.....

లోపలగదిలోకి వెళ్ళినవాణ్ణి గుండె బిగపట్టుకొని వెనక్కి తిరిగేసరికి నాన్న ....

పెదవులూ, చేతులూ, కాళ్ళూ వణికిపోయాయి...

'ఎక్కడికి వెళ్ళావ్?... ఎందుకు వెళ్ళావ్?' అన్నాడు నాన్న.

అప్పుడు నాన్న మోహం ఎంత భయంకరంగా ఉందో చెప్పలేను. రజాకార్ కాశీం మొఖం కంటే కూడా భయంకరంగా ఉంది....

'నీఇష్టం వచ్చినట్లూ ప్రవర్తించావంటే ఒళ్లు చీరేస్తాను... ఫో .... పోయి పడుకో!....' అన్నాడు నాన్న.

మారు మాట్లాడకుండా వెళ్ళి మంచంమీద బోర్లా పడుకున్నాను. కళ్ళంట నీళ్లు ధారాపాతంగా కారేయి... ఏడుపు ఎంత ఆపుకున్నా ఆగలేదు!.........

నేను ఏడుస్తూ అలాగే పడుకున్నాను. నిద్రపట్టి పోయింది.

* * *

ఉదయం ఆలస్యంగా నిద్రలేచాను. అదీ నాన్న, ముంతాజ్ లేపగా లేపగా లేచేను.

రాత్రి జరిగినదంతా ఓ కలలా ఉంది నాకు.

ఇవ్వాల్టినుంచీ ఈ ఇంట్లో పచ్చిమంచినీళ్లు కూడా ముట్టుకోకూడదు అని నిశ్చయించుకున్నాను.

ముఖం కడుక్కొని వెళ్ళి గదిలో కూర్చున్నాను.

ముంతాజ్‌ని పిలిచాను.

'ముంతాజ్! నేను ఇవాళకాఫీ, టిఫిను తీసుకోను, నువ్వు తీసుకుంటావా?...' అని అడిగాను.

'ఊహు!... నువ్వు కాఫీ తాగితేనే తాగుతాను. లేకపోతే నేనూ

తాగను!' అన్నది ముంతాజ్.

'అయినా నువ్వెందుకు తాగవ్?'అని అడిగింది.

'ఆ సంగతి ఇప్పుడు చెప్పకూడదు వెళ్ళు' అని పంపేశాను.

నాన్న ముందు కాఫీకి రమ్మని కేకేశాడు. కానీ, రానని వెళ్ళలేదు. అప్పుడు నాన్నే కాఫీ, టిఫినూ తీసుకొని గదిలోకి వచ్చి తీసుకో వేణూ' అన్నాడు.

'వద్దు నాన్నా! నాకేం వద్దు!' అన్నాను.

'ఏం.... వొంట్లో బాగాలేదా?.....' అని అడిగాడు.

'లేదు, బాగానేఉంది' అన్నాను.

'మరెందుకని?'అంటూ నాన్న ఒళ్ళు వేడిగా ఉందేమోనని చూశాడు.

'నాకు అక్కర్లేదు, అంతే!' అంటూ చెయ్యి విదిలించుకున్నాను.

నాన్న చాలాసేపు బతిమాలాడు. కానీ నేను ఒప్పుకోలేదు.

దాంతో ఆయనకి బాగా కోపం వచ్చేసింది.

'ఏం ఏమొచ్చిందీ?.... ఎందుకు తినవు?' అని అడిగాడు.

'నేను తినను'.....

'కారణం చెప్పు!'

'అది దొంగసొమ్ము.... ఈ దొంగతిండి నేను తినను.' ఆ మాటలు అనీ అనడంలోనే నా గూబగుయ్యిమంది. కళ్ళు జిగేలుమన్నాయి. నాన్న నన్నెప్పుడూ అంతదెబ్బ కొట్టలేదు.

నాన్న నా వైపు ఎర్రగా చూసి గభాలున చొక్కా పుచ్చుకున్నాడు.

'ఈ సంగతి ఎవరికైనా చెప్పేవో నిన్ను ముక్కలు ముక్కలు చేస్తాను' అన్నాడు. తర్వాత -

ముంతాజ్‌ని కేకేసి 'నువ్వయినా కాఫీ తాగుతావా?' అడిగేడు.

ముంతాజ్ బిక్క మొగం వేసి అడ్డంగా తల తిప్పింది.

'సరే.... ఇద్దరూ చావండి ... ' అంటూ బయటికి వెళ్ళిపోయాడు నాన్న.

'ఏం వేణూ ఎందుకు కాఫీ తాగవో నాకు కూడా చెప్పకూడదా?' అని అడిగింది ముంతాజ్.

'లేదు ముంతాజ్ చెప్పకూడదు' అన్నాను.

ఆ మధ్యాహ్నం నాన్న మళ్లీ అన్నం తినమని బతిమాలేడు. ఎన్నో మంచి మాటలు చెప్పేడు. ..... ఊహు... వినలేదు నేను. ఆ పూట నాన్న కూడా అన్నం తినలేదు!

ప్రొద్దుట అయితే - 'మీ రెవరూ తాగకపోతే అంత కాఫీ నేనే తాగుతా...' అని కోపం తెచ్చుకొని గిన్నెడు కాఫీ తానే గడగడా తాగేశాడు.

కానీ, మధ్యాహ్నం అన్నం మాత్రం తినలేదు.

విచారంగా ముఖం పెట్టి, బయటికి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం పార్వతి పిన్ని తీసుకొని వచ్చాడు.

పార్వతి పిన్నికూడా ఎన్నోవిధాల బతిమాలింది. కానీ, వినలేదు నేను.

'పోనీ, కారణం చెప్పు... నా మీద నీకు ప్రేమ లేదా - నేను నీకు పిన్నిని కాదా? పిన్నికి కూడా చెప్పకూడని రహస్యమా అది?-' అని ఎన్నో విధాల అడిగింది పిన్ని.

'నేను ఎవరికీ చెప్పనుగా .. '

'ఆ దేవుడిమీద ఒట్టు! చెప్పమ్మా' అని బ్రతిమాలింది.

ఇక ఊరుకోలేక రాత్రి జరిగిన సంగతి అంతా చెప్పేశాను.

అది విన్న పిన్నిముఖం ఒక్కసారి మారిపోయింది.

'నిజంగానా బాబూ?' అని అడిగింది.

'ఔను పిన్నీ' అని ఒట్టువేశాను.

పిన్ని నన్ను అన్నం తినమని బతిమాలలేదు - మెల్లగా లేచి 'నేను వెళ్తున్నా' అంది.

'ఏం.... నీ మాటకూడా వాళ్ళు వినలేదా?' అన్నాడు నాన్న.

'కన్నతండ్రిమాటే విననివాడు - బయటివాళ్ళ మాట వింటాడా?' అంది పిన్ని.

'ఏమిటి పార్వతీ నువ్వనేది?... కొత్తగా మాట్లాడుతున్నావేం' అన్నాడు నాన్న.

'అంతా కొత్తగానే ఉంది ... నే వెళ్తాను' అంది పిన్ని.

'వీల్లేదు... నువ్వు వెళ్ళొద్దు' అన్నాడు నాన్న.

'నన్ను ఆపకండి - మీకు ఆ అధికారం లేదు....' అని, కళ్ళనిండా నీళ్ళునింపుకొని - పిన్ని గబగబా వెళ్ళిపోయింది.

నాన్న తల చేత్తో పుచ్చుకొని కూర్చుండి పోయాడు.

ఆ రాత్రి కూడా ఎవ్వరం అన్నం తినలేదు.

నాన్న అర్ధరాత్రి బయటికి వెళ్ళేడు కాని, మళ్ళీ వెంటనే వచ్చేశాడు.

రాత్రి ఎవ్వరికీ నిద్రపట్టలేదు!.....

# భీముడి కథనం

ఇంతలోనే పరిస్థితులు ఇంతగా మారిపోతాయని నేను అనుకోలేదు.

నేను ఎలాంటి ఉద్యోగం చేస్తేమాత్రం వీళ్ళకెందుకు? పాపం, పుణ్యం ఇవన్నీ నిన్న కాక మొన్న పుట్టిన వేణూకి తెలుసా? నాకు తెలుసా?

నేను ఎన్ని విధాల ఆలోచించి, ఎన్నాళ్లు ఆలోచించి ఈ ఉద్యోగంలో ప్రవేశించేనో వాడికేం తెలుసు.....

పాపం చేసో... పుణ్యం చేసో ఆర్జిస్తున్నాను.... వంట చేసి పెడుతున్నాను. తినడానికి వీడికి కష్టమా?

పైగా ఇది పాపపు సొమ్ము.... పాపపు తిండి... తింటే అరగదూ అంటాడా?-

సరే, పసివాడు-లోకం గురించి వీడికింకా తెలీదు కాబట్టి అన్నాడు.

బాగానే ఉంది. కానీ, పార్వతి కూడా అదేమాట.....

చిన్నప్పట్నుంచి కష్టపడింది. కష్టం సుఖం తెలుసు.

అన్నీ తెలిసీకూడా - నేను చేస్తున్న ఉద్యోగం ఫలానా అని తెలియగానే - నీకూ, నాకూ సంబంధం లేదు అని వెళ్ళిపోయింది....

పైగా వీళ్ళంతా సత్యాగ్రహం... వీడితోపాటు ఆ పిల్లా సత్యాగ్రహం!....

అక్కడ పార్వతి హోటలు కూడా మూసేసి నిరాహార దీక్ష ప్రారంభించింది!

నేను ఎవరికోసం ఆర్జిస్తున్నానో - ఎవరికోసమయితే ఈ పాడు ఉద్యోగానిక్కూడా దిగానో.... వాళ్ళకి అక్కర్లేని ఉద్యోగం నాకెందుకూ? -

కానీ-

ఇవాళ నేను ఒక ముఖ్యమయిన - ప్రమాదమయిన కార్యం చెయ్యవలసి ఉంది.

మా బందిపోటు ముఠాని గురించి దర్యాప్తులు సాగిస్తున్నారు.

అంచేత, ఇక్కడినుంచి మకాం మార్చేయాలని నిశ్చయించుకున్నాడు మా నాయకుడు.

కొన్నాళ్ళపాటు దొంగతనం కూడా ఆపాలని నిశ్చయించుకొన్నాడు.

ఆ కారణం చేతనే - ఇవాళ రాత్రి పెద్ద దోపిడీ జరగవలసి ఉంది. అది సామాన్యమయినది కాదు. బ్యాంకు దోపిడీ!

నగరంలో ఉన్న బ్యాంకును అర్ధరాత్రి వెళ్ళి దోచుకోవాలి! ఆ డబ్బుతో కొన్నాళ్ళు 'దోపిడీలు' లేకుండా జీవించాలి.

నేను అంచేత ఇవాళ ఖచ్చితంగా వెళ్ళి తీరాలి- ఒక్క మా నాయకుడు తప్ప, మిగతా అందరు కూడా ఈ దోపిడీలో పాల్గొని తీరాలి.

ఇవాళ వెళ్ళినవాణ్ని-మళ్ళీ ఆరునెలలవరకూ వెళ్ళనవసరం ఉండదు. అంత డబ్బు దక్కుతుంది.

కాని, ఏం లాభం?-

ఆ డబ్బు వీళ్ళకెవరికీ అక్కర్లేదు, ఆ సొమ్ము వీళ్ళెవరూ తినరు....

ఏం చేసేది?....

నా మనసు మార్చుకోక తప్పిందికాదు.

వీళ్ళకి అఖ్కర్లేని డబ్బు నేనేం చేసుకుంటాను? నాకెందుకూ!-

ఇక, నాకు రాత్రి బ్యాంకు దోపిడీకి వెళ్ళవలసిన అవసరం కూడా లేదు.

వేణూని పిలిచాను.

'వేణూ... నేను మనసు మార్చుకొన్నాను. ఈ ఉద్యోగం మానేస్తున్నాను' అని చెప్పాను.

'నిజంగానా నాన్నా....' అన్నాడు వేణు. వాడి కళ్లవెంబడి జలజలా నీళ్ళు కారేయి....

'నిజం ... నీమీద ఒట్టు!!' అన్నాను.

'ఇప్పుడే వెళ్లి ఆ బందిపోటు నాయకుడికి - రాత్రి నుంచీ రానని చెప్పివస్తాను!' అన్నాను.

'నువ్వెందుకు నాన్నా చెప్పడం? నే వెళ్ళి చెప్పివస్తాను. లేకపోతే ఉత్తరం రాసి ఇవ్వు ఇచ్చి వస్తాను!' అన్నాడు వేణు.

నాకు నవ్వు వచ్చింది. ఇంకా వాడికి నా మీద నమ్మకం కుదరలేదు.

'సరే ఉత్తరం రాసిఇస్తాను. తీసుకువెళ్ళి ఇవ్వు' అన్నాను.

ఉత్తరం రాసిఇవ్వడంవల్ల - వాళ్ళతో విరోధం కూడా రాదు.

-

ముందుగా వెళ్ళి ముగ్గురికీ కాఫీ కలిపేము. నేనూ, ముంతాజ్, వేణూ ముగ్గురం కాఫీ తాగేము.

తర్వాత-

నాకు వొంట్లో బాగులేదని, రాత్రి బ్యాంకు దోపిడీకి రాలేననీ ఉత్తరం రాశాను.

'సరే నాన్నా! ఇది తీసుకువెళ్ళి నేను ఇచ్చేస్తాను. నువ్వు పార్వతి పిన్నిదగ్గరకు వెళ్లి ఈ సంగతి చెప్పి భోజనానికి తీసుకురా. అంతా కలిసి భోజనం చేద్దాం. నీతో ముంతాజ్‌ని కూడా తీసుకువెళ్ళు' అన్నాడు వేణు.... బట్టలు గబగబా మార్చుకొని.

వాడి సంతోషం.. ఆ తొందరా చూస్తే నాకు నవ్వు ఆగింది కాదు.

అన్నిటికీ 'ఊ....' అన్నాను. వేణూ ఉత్తరం తీసుకొని బంది పోటు ముఠా ఉండే స్థలం గురించి గుర్తులు అన్నీ తెలుసుకొని - గబగబా వెళ్ళి పోయాడు.

నేనుకూడా బట్టలు మార్చుకొని ముంతాజ్ ని తీసుకొని పార్వతి దగ్గరకు వెళ్ళాను.

పార్వతి ఆవేళ కూడా హోటలు తీయలేదు.

లోపల ఒంటరిగా కూర్చొని ఉంది. నేను వెళ్ళగానే లేచి నుంచుందిగాని, పలుకరించలేదు. పిలిచినా పలకలేదు.

అప్పుడు ముంతాజ్ వెళ్ళి సంగతంతా చెప్పింది. 'నిజంగా!' అంది.

'ఊ....' అంది ముంతాజ్.

నేను మాత్రం అటుపక్కకి కూడా చూడకుండా నించున్నాను.

ఇంతలో పార్వతి నా కాళ్లమీదపడి 'నన్ను క్షమించు....' అంది.

తర్వాత -

"మనం మనింటికి వెళ్దాం. ఈ పాటికి వేణూకూడా ఇంటికి వచ్చేసిఉంటాడు. ఇవాళ అందరం అక్కడే భోజనం చేద్దాం" అన్నాను నేను.

"అయ్యో....వేణూని ఆ దుర్మార్గులు దగ్గరికి పంపించారా? - ఎంత పిచ్చిపని చేశారు?" అంది పార్వతి.

"అబ్బే...వేణూని వాళ్ళేంచెయ్యరు పార్వతీ" అన్నాను.

"లేదు, నాకేదో భయంగాఉంది.- ముందు మనం వెళ్ళి - రాత్రి ఇలా బ్యాంకు దోపిడీ జరగబోతున్నదని పోలీసులకి చెప్పివద్దాం తర్వాత - వేణూదగ్గరికి వెళ్దాం" అన్నది పార్వతి.

"మనం రిపోర్టు ఇస్తే నన్ను కూడా పట్టుకోరా మరి?" అన్నాను.

"లేదు....అలా జరగకండా నేను చూసుకుంటాను! నామీద దయఉంచి నేను అన్నదానికల్లా మీరు 'అవును' అనండి..." అన్నది పార్వతి.

"సరే కానీ, ఈ రభసంతా ఎందుకూ? ఇదంతా లేనిపోని బాధ కదూ?" అన్నాను నేను.

"ఏంకాదూ... నాకేదో భయంగా ఉంది. ముందు పోలీస్టేషన్‌కు వెళ్దాం పదండి" అన్నది పార్వతి.

పార్వతీ, నేను, ముంతాజ్ కలసి పోలీసు స్టేషన్‌కు వెళ్ళాం.

పార్వతి ఇలా రాత్రి దోపిడీ జరగబోతోందని, జాగ్రత్తగా ఉండమనీ చెప్పింది.

ఈ సంగతి వాళ్ళు చెప్పుకుంటూ ఉండగా విన్నట్లు చెప్పింది.

వాళ్ళు ఎక్కడ ఉంటారో చెప్పమని అడిగేదు పోలీసు ఇన్‌స్పెక్టర్.

"అదే మాకు తెలీదు....." అని చెప్పింది పార్వతి.

"సరే తగిన జాగ్రత్తలన్నీ తీసుకుంటాం ఈ సంగతి చెప్పినందుకు చాలా సంతోషం....." అంటూ ఇన్‌స్పెక్టర్ పార్వతి అడ్రసు తీసుకున్నాడు.

తర్వాత - ఇంటికి చేరుకున్నాం.

వేణూ ఇంకా రాలేదు.

"ఇక ఆలస్యం చెయ్యడం బాగుండదు. పదండి ...ఆ ముఠా ఎక్కడుంటుందో అక్కడికి వెళ్దాం. నా వేణుకు ఏదో ఆపద సంభవించింది......" అంటూ గాభరా పడింది పార్వతి. అప్పటికి చీకటి పడుతోంది.

ఆవాళ పూర్ణిమ!

చందమామ అప్పుడే మీదికి ఎక్కుతున్నాడు.

ముగ్గురం - గబగబా ఆ బందిపోటు ముఠాఉండే చోటుకు బయలుదేరేం!

పార్వతి చాలా గాభరా పడుతోంది.! చాలా త్వరగా నడుస్తోంది.

ముంతాజ్ అయితే క్షణ క్షణం కళ్ళు తుడుచుకుంటూనే ఉంది.

నిజంగా నా వేణుకి ఏదయిన ఆపద సంభవించిందేమో.......

# రచయిత కథనం

నేను మీ అందరికీ తెలుసుననే అనుకుంటాను. ఇప్పుడు కథంతా చిక్కుపడిపోయిది.

భీముడూ, పార్వతీ, ముంతాజ్‌లు ముగ్గురూ బందిపోటు ముఠా ఉండే చోటుకు వస్తున్నారు.

ఇక్కడ-

పార్వతి భయపడినట్టుగానే జరిగింది.

వేణు భీముడు ఇచ్చిన ఉత్తరం తీసుకొని బందిపోటు ముఠా ఉండేచోటుకు వచ్చాడు.

అప్పటికి ముఠా వాళ్లెవరూ అక్కడ లేరు. ఒక్క నాయకుడూ, అతగాడి అనుచరుడూ, ఇద్దరే ఉన్నారు.

వేణుని బయటనుంచో పెట్టి భీముడి కొడుకు వచ్చినట్టుగా నాయకుడికి చెప్పాడు అనుచరుడు.

"అలాగా" అంటూ నాయకుడు బయటికి వచ్చాడు.

నాయకుడిని చూసి వేణు చేతిలోఉన్న ఉత్తరం లాక్కుని చదువుకున్నాడు. ముఖం చిట్లించి - "హూ...." అని నలిపి పారేశాడు.

వేణు కళ్ళలోకి చూస్తూ "మీ బాబుకు నిజంగా జ్వరం వచ్చిందా?" అని అడిగాడు వేణుని

"అబద్దం జ్వరాలు కూడా ఉంటాయా?" అని ఎదురు ప్రశ్న వేశాడు వేణు.

"తండ్రిపోలికలు బాగా ఉన్నాయే" అన్నాడు నాయకుడు.

"తాతపోలికలుకూడా ఉన్నాయి.....నువ్వు చేసిన పనికి నాన్న కాబట్టి ఊరుకున్నాడు. నేనయితేనా,......" అంటూ చీదరించుకొని వెనక్కు తిరిగి వెళ్ళిపోబోయాడు వేణు.

"ఆగు....ఏమిటి నే చేసినపని.....నువ్వు చేసే దేమిటి?" అన్నాడు నాయకుడు కళ్లెర్రజేసి.

"నువ్వు చేసినపని నీ మనసుకి తెలుసు. నా కళ్ళకి తెలుసు! నే చెయ్యబోయేది. రేపుచేసి మరీ చూపిస్తాను" అన్నాడు వేణు, గబబా ముందుకు పోతూ.

"ఆగు....అక్కడే! నువ్వేంచేయదల్చుకున్నావో చేసి చూపించు.... ఇక్కడే......ఇప్పుడే" అంటూ గభాలున వెళ్ళి- చొక్కాపుచ్చుకొని, కంఠంమీద బొటనవ్రేలితో గట్టిగా నొక్కేడు నాయకుడు.

వేణుకి ప్రాణంపోయినంతపని అయిందికానీ, విడిపించుకొని నాయకుడిచెంపమీద చాచిపెట్టి కొట్టేడు. తక్షణం నాయకుడు

వేణూని ఒక్క తోపుతోసి-

"వీణ్ణి బంధించు!" అన్నాడు అనుచరుడితో.

వాడు వేణు కాళ్ళూ, చేతులూ కట్టి - ఓ చెట్టుకింద పడేశాడు.

తర్వాత, నాయకుడు "నువ్వు నగరంలోకి వెళ్ళి మన ముఠా వాళ్ళకి సాయంచెయ్యి! జాగ్రత్త" అని చెప్పి అనుచరుడిని పంపించేశాడు.

ఇక్కడ-

భీముడు, పార్వతీ, ముంతాజ్ ముగ్గురూ త్వరత్వరగా నడిచి బందిపోటు ముఠా ఉండే చోటుకు వస్తున్నారు.

అంతసేపూ "ఏం పరవాలేదులే" అని ధైర్యంగా ఉన్న భీముడికి కూడా కొంత భయం వేసింది. వేణుకి ఏదో ఆపద సంభవించే ఉంటుందని కలవర పడ్డాడు. గబ గబా ముందుకు నడిచాడు.

భీముడూ, పార్వతితో సమానంగా త్వరగా నడవలేకపోతోంది ముంతాజ్.

"మీరు త్వరగా ముందుకు వెళ్ళండి. నాకు చాలా భయంగా ఉంది. నేను మీ వెనుకనే ముంతాజ్‌ని తీసుకొని వచ్చేస్తాను" అన్నది పార్వతి.

'సరే' నని భీముడు పార్వతికి ఎటు రావాలో గుర్తులు చెప్పి - తాను గబగబా ముందుకు వెళ్ళిపోయాడు.

అలసిపోయిన ముంతాజ్‌ని ఓ దగ్గర కూర్చోబెట్టి అలసట తీరేక

మెల్లగా నడిపించుకుంటూ వెనకనే బయలుదేరింది. పార్వతి.

"ఈ కుర్రాడికోసం వాడు తప్పక వస్తాడు....." అంటూ అక్కడే నుంచున్నాడు నాయకుడు.

వాడు అనుకున్నట్టుగానే భీముడు రానే వచ్చాడు.

"అరే వచ్చేశావా? జ్వరం అన్నావుగా....ఇప్పుడెలా వచ్చావ్?" అని వెటకారంగా అడిగాడు. నాయకుడు.

తాళ్ళతో కట్టి పడేసి - సొమ్మసిల్లి పడిపోయిన వేణుని చూశాడు భీముడు.

"ఇప్పుడు నీ రోజులు దగ్గరికి వచ్చాయి. కాబట్టి వచ్చాను." అన్నాడు.

అంటూనే నాయకుడిని బలంగా రెండుగుద్దులు గుద్దేడు.....నాయకుడు వెల్లకిల్లా పడ్డాడు.

వెంటనే వెళ్ళి వేణు కట్లు విప్పబోయే అంతలో నాయకుడు కర్రతో భీముడి మీద కలయబడి పోయాడు.

ఇద్దరూ ఒకర్నొకరు గుద్దుకున్నారు, కర్రలతో బాదుకున్నారు.

కానీ ఆవేళకి రెండురోజుల్నుంచి తిండికూడాలేని భీముడు కిందపడిపోయాడు. అదీగాక, నాయకుడు చాలా బలమయిన వాడు....

బలమయిన గాయాలు తగిలిన భీముడికి లేచే ఓపిక కూడా లేకపోయింది.

వెంటనే నాయకుడు మొలనున్న 'బాకు' తీసుకుని భీముడ్ని చంపడానికి సిద్ధమయేడు. అంతలో ముంతాజ్, పార్వతీ రానే వచ్చారు. పార్వతి ఈ దృశ్యం చూసి వేణుదగ్గర కుప్పగా కూలిపోయింది.

ముంతాజ్ పరుగునవచ్చి 'బాబా' అని కేకవేసింది!

భీముడి మెడను గట్టిగా కౌగలించుకొని - నాయకుడి వైపు తెరిపార చూసింది.

వెన్నెల వెలుగులో ముంతాజ్‌ని చూసిన నాయకుడు అలాగే నీరయి పోయాడు.

'బాబూ.....నన్ను చంపు!' అంటూ భీముడి మెడని వదలమన్నా వదలని ముంతాజ్‌ని చూస్తూ నిలుచుండిపోయాడు నాయకుడు.

ఇంతలో పార్వతి, వేణు కట్లు విప్పింది.

వేణు కళ్లు తెరవకుండానే 'నాన్నా....కాశీం! కాశీం నాన్నా' అంటూ మూలిగేడు.

'నువ్వా? ఓరి దుర్మార్గుడా......నా భార్యనీ,పిల్లనీ పొట్టన బెట్టుకొన్న దుర్మార్గుడివి నువ్వేనా?' అన్నాడు భీముడు.

మెల్లగా లేచి నుంచున్నాడు.

'హూ....ఇంకా నీ కత్తికి భయపడతా ననుకున్నావా కాశీం?..... భయపడను - కానీ, ఆ దేవుడు నీ గుండెల్లో బండరాయి పెట్టాడా...పసిపిల్లల్ని చంపడానికి నీ చేతులెలా వస్తాయిరా రాక్ష

సుడా? అన్యాయంగా అర్థరాత్రి ఇంట్లో చొరబడి నా పెళ్ళాన్ని, పిల్లని పొట్టన పెట్టుకున్న నీకు, నేను చేసిన ప్రతీ కారం చూడరా....చూడు' అంటూ ముంతాజ్‌ని చూపించాడు భీముడు.

'నా గుండెకూడా నీకున్న బండలాటిదయితే - ఇవాళ నీ కూతుర్ని ఇలా చూడగలిగేవాడివేనా?......నువ్వు చేసిన ద్రోహానికి-----నీ కూతుర్ని నేను పెంచేను! నువ్వని తెలీక - నీ దగ్గర బందిపోటుగా కుదిరి....ప్రజల తలలు బద్దలుకొట్టి నీకు దోచిపెట్టాను.....అందుకుగాను నువ్వు చేసినదేమిటి? నాకున్న ఒక్క పిల్లాడిమీద నీ బలం చూపించి తాళ్ళతో కట్టిపడేశావు......కనీసం, ఈ పసిపిల్లకున్న విశ్వాసం కూడా నీకు లేదురా పాపాత్ముడా!.... రా, వచ్చి చంపరా!.....చంపు' అంటూ ముందుకు వెళ్ళాడు భీముడు.

కాని, భీముడికి అడ్డంగా ముంతాజ్ నించొని - 'రా బాబా..... నన్ను చంపు' అంటోంది.

పార్వతి నిస్సహాయురాలై ఏడుస్తోంది.

'నీ ఉపన్యాసం అయిందా భీముడు?' అని అడిగాడు కాశీం.

కాశీం కళ్ళల్లో నీళ్ళు నిలిచేయి.

'అవును..... నా బాధ, నీకు ఉపన్యాసం.....నా చావు నీకు ఆనందం రా.....వచ్చి చంపు ....' అన్నాడు భీముడు.

కాశీం కళ్ళవెంట బొటబొటా రెండు కన్నీటి బిందువులు రాలేయి. అవి కన్నీళ్ళు కాదు. కల్మషంతో నిండిన విషపు చుక్కలు....

ఇప్పుడు కాశీం కళ్ళు నిర్మలంగా ఉన్నాయి.

'అవును....నువ్వేన్ని మాటలన్నా ఫర్వాలేదు....నేను అపకారం చేశాను! నువ్వు నాకు ఉపకారం చేశావు. నువ్వు ఎంత ఎక్కువ తిడితే అంత మంచిది. నీచేత తిట్లు అయినా తింటే కొంత ఋణం తీరుతుంది. కాబట్టి తిట్టు. కానీ, కాశీం ఇంతవరకూ ఎత్తిన కత్తి దించలేదు! ఇకముందు దించడు!' అంటూ - కత్తిని అమాంతం తన గుండెల్లో దింపుకున్నాడు కాశీం.

బాధగా 'సుభానల్ల' అంటూ మూలిగి - నేల కూలేడు.

'బాబా......' అని అరిచింది ముంతాజ్.

ఏడుస్తూ వెళ్ళి తండ్రి గుండెల మీద పడింది.

'ఏడవకు అమ్మా....ఏడవకు. అదిగో. నీబాబా అతడే! నేను కాదు అతణ్ణి ఒకసారి ఇలా పిలువు' అన్నాడు కాశీం.

ముంతాజ్ వెళ్ళి భీముణ్ని రమ్మన్నది.

భీముడు ముంతాజ్ కళ్ళు తుడిచి 'పదమ్మా......' అంటూ కాశీం దగ్గరకు వెళ్ళాడు.-

కాశీం భీముడి రెండు చేతులూ పుచ్చుకొని -

'భీముడు! ఇవి చేతులు కావు! నువ్వు చేసిన సహాయం చచ్చిపోయికూడా మర్చిపోను. అనవసరమయిన మత కలహాలకుపోయి .....ఎన్నో కుటుంబాల్ని మట్టిపాలుజేసి....నా జీవితాన్ని నాశనం చేసుకున్నాను..... చివరిసారిగా ఒక్క కోరిక కోరుతాను.

కాదనవుగా' అని అడిగాడు కాశీం.

'చెప్పు' అన్నాడు భీముడు.

'నువ్వు సరేనంటే చెబుతాను' అన్నాడు కాశీం.

'సరే.....'

'జీవితంలో కాశీం ఎప్పుడూ ఎవర్నీ బతిమాలలేదు. ఎవడి కాళ్ళూ పట్టుకోలేదు. కానీ, ఇవాళ ఒక మంచి వాడిని - భీముడిని.....ముష్టివాడిలాగా అడుగుతున్నాడు. విను- నా పిల్లని ఎంతోముద్దుగా పెంచుతావని నాకు తెలుసు కాని, అది పెద్ద దయినాక కూడా నీ దగ్గరే ఉండేలా చూచుకో.... దాన్ని నీ ఇంటి కోడలిగా చేసు కొని...... నా బతుకుని పవిత్రం చెయ్యి....ఇదే నాకోరిక. ఇంకో మాట కూడా గుర్తించుకో. నీ భార్యని నే ఎత్తుకు పోయిన మాట నిజమే కాని.......ఆ మనిషి నిప్పులాంటిది. దారిలోనే బావిలో దూకి ఆత్మహత్య చేసుకుంది..... నేను చెప్పిన సంగతి మాత్రం మర్చిపోకు.....అమ్మా! ముంతాజ్. నీకు అన్నీ భీముడే' అంటూ చెయ్యి పుచ్చుకొని భీముడిచేతిలో పెట్టాడు.

కాశీం కళ్ళలో నీళ్ళు నిలిచాయి. అలాగే కళ్ళు మూసుకున్నాడు.

ముంతాజ్ 'బాజా' అంటూ కాశీంమీద పడిపోయింది.

భీముడు ముంతాజ్‌ని శవం మీద నుండి తన చేతుల్లోకి తీసుకొని -

"నీ బాబావి నేనమ్మా! నేనే!" అంటూ హృదయానికి హత్తుకున్నాడు.

అంతలో వేణు రానేవచ్చాడు.

వేణు భీముడి ఒడిలో వాలిపోయాడు.

భీముడు వేణుని పొదివి పట్టుకున్నాడు.

"నాన్నా!" అన్నాడు వేణు.

అతనికి కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

"పిచ్చి వేణు" అంటూ భీముడు వేణుని ముద్దు పెట్టుకున్నాడు. ముంతాజ్‌ను కూడా ముద్దు పెట్టుకున్నాడు.

ఇద్దరినీ హృదయానికి హత్తుకున్నాడు.

అతని హృదయం పులకించి పోయింది.

ఆ క్షణంలో ఆ ఇద్దరూ అతనికి రెండు కన్నుపాపలైనారు.

'పార్వతి ......మనం పోదామా?......' అన్నాడు భీముడు.

పార్వతి కళ్ళతోనే ఔనంది.

ఆమె కళ్ళల్లోనీళ్ళు చూసి 'ముంతాజ్ లాగా పిన్ని కూడా ఏడుస్తోంది. నాన్నా' అన్నాడు వేణు.

భీముడేం మాట్లాడలేదు.

'ఏడవకు పిన్నీ....బాబా ఉన్నాడుగా' అన్నది ముంతాజ్.

ఆ మాటలకు పార్వతి నవ్వింది. వేణు నవ్వేడు. ముంతాజ్ నవ్వింది. భీముడు నవ్వుకున్నాడు.

భీముడు, పార్వతీ, ముంతాజ్, వేణు నలుగురూ కలిసి

ఇంటివైపు వెళ్ళిపోయారు.

చందమామ నల్లని మబ్బునుంచి తప్పించుకువచ్చి చల్లని వెన్నెల కురిపించేడు......

ఆ చందమామ వెన్నెల ముంతాజ్ నవ్వులా ఉంది. అది వేణు నవ్వులాగా ఉంది.

వెన్నెలకి మతం తేడా తెలీదు. వారు వీరు అనే భేదం లేదు. అందరి హృదయాల్లోనూ ఆనందం ఇవ్వగలది వెన్నెల....

చిన్నారి హృదయాలూ అంతే.

వాళ్ళకి కులమత భేదాలు, కొద్ది గొప్ప తేడాలు తెలీవు

వాళ్లు మమతకీ, మంచికీ ప్రతి రూపాలు!

* * *

